జూలై 2018

వానా కాలపు శుభాకాంక్షలతో!



# కొత్తపల్లి

తెలుగు పిల్లల ఈ మాసపత్రిక  వెల రూ.30/-

Shankar




సంపుటి: 4 సంచిక: 4 పుటలు: 68 విడి ప్రతి వెల: 30 రూ. జులై 2018



**Editor:** Narayana Sarma

**Owned, Printed and Published by:**
Kottapalli Prachuranalu,
1-127/A, Near MRO Office,
Chennekothapalli,
Ananthapuramu District
Andhra Pradesh-515101
Website: http://kottapalli.in
Email: team@kottapalli.in
Phone: 7702877670

**Printed at:**
Mudrica Offset Printers,
Sanyasi Raju street,
Gandhi Nagar,
Vijayawada,
Andhrapradesh
Phone: 08662579129

**RNI Registration No:** APTEL/2014/62705
**Postal Registration No:** HDP/008/2018-2020

**స్ఫూర్తి :** యు. సుబ్బరాజు

**సంపాదకులు:** నారాయణ శర్మ

**ప్రచురణ:**

కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి

**యాజమాన్యం:**

సత్య - ఫౌండేషన్ ఫర్ ఎ హెల్దీ సొసైటీ, చెన్నూరు.

**చిత్రాలు:**

అడవి రాముడు : 9491870753

రాధా స్కూల్ (అనంతపురం) లో చదివే పిల్లలు

**వెబ్సైటు నిర్వహణ:**

ఆనంద్, లక్ష్మి

**వాణిజ్యం, మార్కెటింగు:**

బి. అశోక్: 9963571510

కె. మల్లికార్జున: 9000453887




# విషయ సూచిక






ముఖచిత్రం: సంగీతం

చిత్రకారుడు: శ్రీ శంకర్

కొత్తపల్లి 99 వ పుస్తకం!




---

ఏతే సత్పురుషా: పరార్థ ఘటకా: స్వార్థాన్ పరిత్యజ్య యే
సామాన్యాస్తు పరార్థముద్యమ భృత: స్వార్థావిరోధేన యే ।
తే మీ మానుష రాక్షసా: పరహితం స్వార్థాయ నిఘ్నంతి యే
యే తు ఘ్నంతి నిరర్థకం పరహితం తే కే న జానీమహే ॥

సంస్కృత మూలం
(భర్తృహరి)

తమ కార్యంబు బరిత్యజించియు పరార్థ ప్రాపకుల్ సజ్జనుల్
దమ కార్యంబు ఘటించుచున్ బరహితార్థ వ్యాపృతుల్ మధ్యముల్
దమకై యన్య హితార్థ ఘాతుక జనుల్ దైత్యుల్ వృథాన్యార్థ భం
గము గావించెడు వారలెవ్వరొ యెఱుంగన్ శక్యమే యేరికిన్?

తెలుగు అనుసరణ
(ఏనుగు లక్ష్మణ కవి)

భావం: తమ పనులను వదులుకొని ఇతరులకు మేలు చేసేవాళ్ళు ఉత్తములు. ఒక వైపున తమ పనులు తాము చేసుకుంటూ, మరోవైపున ఇతరులకు పనికొచ్చే పనులు చేసేవాళ్ళు మధ్యములు. స్వార్థం కొద్దీ ఇతరులకు ఎలాంటి మేలూ చేయనివాళ్ళు మనిషి రూపంలోని రాక్షసులే. మరి ఇంక కావాలని ఇతరులకు కీడు చేసేవాళ్ళనైతే ఏమనాలో కూడా ఎవ్వరికీ తెలీదు.

# సంగీతం

"లాలా లలాల లాలా.. లలలా లలా లలాలల లలలా" అరుస్తూ స్నానం చేస్తున్నాడు విష్ణు. బయటి నుండి వింటున్న తాతయ్య చిన్నగా నవ్వాడు.

"అంత నవ్వేందుకు ఏముంది? మీరు కూడా రోజూ తీస్తారుగా, బాత్రూం రాగాలు?" సాగదీసింది బామ్మ.

"అవునవును- మనవడు కదా, జీన్స్ ఎక్కడికి పోతాయి?" అన్నాడు తాతయ్య నవ్వుతూ. "నువ్వు మరీ అతి, తాతయ్యా! పాటలు పాడుకోటంలో కూడా జీన్స్‌నే చూస్తున్నావంటే ఇంకేం చెప్పాలి?" అంది అక్కడే ఉన్న సుధ.

సుధ ఇంటర్లో చేరింది, ఇప్పుడే. "జీన్స్ వేసుకునేందుకు బాగుంటాయి గానీ చదువు కునేందుకు బాగుండవు" అనేది తన నిశ్చితాభిప్రాయం.

"ఏమో తల్లీ, కొన్ని కుటుంబాల్లో సంగీతం ప్రవహించటం, కొందరు పాట వినబడగానే వెన్నపూసల్లాగా కరిగిపోవటం, మరి కొందరు బండల్లాగా ఎలాంటి స్పందనా లేకుండా ఉండటం చూస్తే నాకు అట్లా అనిపిస్తుంది. కొందరు లలిత సంగీతం వింటారు, కొందరికి కర్నాటక సంగీతం ఇష్టం; కొందరు హిందుస్తానీ సంగీతాన్ని ఇష్టపడతారు; కొందరు పాశ్చాత్య సంగీతాన్ని మెచ్చుతారు- 'లోకో భిన్న రుచి:. అయినా ఈ మధ్య అందరూ సినిమా సంగీతం వెంట పడ్డారనుకో, చెవుల్లో స్పీకర్లు పెట్టుకొని సమయమూ సందర్భమూ లేకుండా ఒకటే మ్రోగించుకుంటున్నారు!' అన్నాడు తాతయ్య.

"అవునవును. అట్లాగే వాళ్ళ చెవులకు చిల్లులూ పడిపోతున్నాయట- మా ఈయస్టీ

డాక్టరుగారు చెప్పారు. మీరు ఎన్నైనా అనండి. ఈ కాలపు సినిమా పాటల్ని కూడా మీరు సంగీతం అంటారుగానీ, అదో రణగొణ ధ్వనిలా తప్ప మరోలాగా ఉండదు!" అన్నది బామ్మ.

"అట్లా అనిపించేది నీ జీన్స్‌కు బామ్మా; నిజంగా ఆ రకం సంగీతాన్ని ఇష్టపడే వాళ్లని అడిగితే వాళ్లు ఇంకోలా చెబుతారు" అన్నాడు తాతయ్య నవ్వుతూ.

'అవున్లెండి! ఆ రోజుల్లో ఏదో 'రిఫ్‌రాఫ్' అంటూ ఎగర్లేదూ, మీరు కూడానూ? ఇప్పుడంటే కీళ్లు వదులైపోయినై కాబట్టి, ఇట్లా నిలకడగా 'రాగం' కడుతున్నారు గానీ?!' వెటకరించింది బామ్మ.

"'రిఫ్‌రాఫ్' కాదోయ్ 'హిప్ హాప్'! రాగం, తాళం, బీట్, నోట్ అన్నీ సంగీతమే కదటోయ్, తేడాలేమీ లేవు! అయినా వయసు పెరిగే కొద్దీ రాగం రక్తి కడుతుందట- ఎవరోచెప్పారు" అన్నాడు తాతయ్య, తగ్గకుండా.

"వయసు కాదు, అనుభవం! అయినా యీ రోజుల్లో పిల్లలంతా సినిమా పాటలు పెట్టుకొని వినే వాళ్లే గానీ, నిజంగా గొంతెత్తి పాడి అనుభవం తెచ్చుకుంటున్న వాళ్ళెందరు? సంగీత జ్ఞానం ఉన్నవాళ్ళెందరు? ఏదైనా ఓ సంగీత వాయిద్యాన్ని చక్కగా వాయించే వాళ్లెందరు? సినిమా పాటల రొదలో మన రాగ-తాళాల గతి ఏమౌతుందో తెలీకుండా ఉందసలు!" వాపోయింది బామ్మ.

"అదేం లేదులే బామ్మా! మా బళ్లో వారానికి రెండు రోజులు మ్యూజిక్ క్లాస్ జరుగుతుంది. రకరకాల సంగీతాలు నేర్పిస్తారు మాకు. శాస్త్రీయాలు, జానపదాలు, భక్తి గీతాలు, సినిమా పాటలు- ఏవంటే అవి! అంతేకాదు- మాకు ఏ వాయిద్యం ఇష్టమైతే అది నేర్పిస్తారు మా సర్- తెలుసా? అసలు ఆయనకు రాని వాయిద్యమే లేదు!" చెప్పింది ఎనిమిదో తరగతి చదివే వైష్ణవి.

"అమ్మో! ఎందరో మహానుభావులు! మీ సంగీతం సార్‌ని ఒక సారి మనింటికి భోజనానికి పిలువమ్మా! అట్లాంటి వాళ్లని దర్శించుకుంటే చాలు- పాపాలన్నీ పోతాయి!" అన్నది బామ్మ, ఇతరులెవ్వరికీ కనబడని సంగీతం దేవతకి మొక్కుకుని చెంపలు వేసుకుంటూ.

"సంగీతకారుల్ని మెచ్చుకుంటేనూ, దర్శించుకుంటేనూ, మొక్కుకుంటేనూ చాలదు, వాళ్ళకు శిష్యరికం చెయ్యాలి! వాళ్లనుండి విద్యను గ్రహించి, అభ్యాసం చేయాలి. అనగ ననగ రాగ-మతిశయిల్లుచునుండు!" అంటూనే, 'సంగీత జ్ఞానము- భక్తి వినా, సన్మార్గము కలదే?" అని కృతి ఎత్తుకున్నాడు తాతయ్య.

పిల్లల ప్రపంచంలో సంగీతాన్ని పండించే మహానుభావులందరికీ పేరుపేరునా వందనాలు!

కొత్తపల్లి బృందం

చదువది ఎంత గల్గిన రసజ్ఞత ఇంచుక చాలకున్న నా
చదువు నిరర్థకంబు; గుణ సంయుతులెవ్వరు మెచ్చరెచ్చటన్
పదనుగ మంచి కూర నల పాకము చేసిననైన నందు నిం
పొదవెడు ఉప్పు లేక రుచి పుట్టగ నేర్చునటయ్య, భాస్కరా?

ఎంత చదువుకున్నాగానీ, చదువులోని సారాన్ని ఆస్వాదించటం తెలీకపోతే ఆ చదువు వృథా. ఎంత చక్కని కూరను వండినాగానీ, అందులో తగినంత ఉప్పు లేకపోతే ప్రయోజనం ఏముంటుంది?

మానవుడాత్మకిష్టమగు మంచి ప్రయోజనమాచరించు-
కానక అల్పుడొక్కడది కాదని పల్కిన, వాని పల్కుకే
మానగ జూడడా పని- సమంచిత భోజన వేళ ఈగ కా
లూనిన వంటకంబు తినకుండగ నేర్పగునోయి, భాస్కరా?!

మనం మనకు నచ్చిన మంచి పనిని చేస్తూ పోవాలి. ఎవరో ఏదో అన్నారని ఆ పనిని ఆపనక్కరలేదు. మంచి భోజనం చేసేటప్పుడు గిన్నెమీద ఈగ వాలిందని తినటం మానేస్తామా?




# దావీద్ విచారం

బిట్టు కథలు

*జరిగిన కథ: బిట్టు ఢిల్లీలో ఉంటాడు వాళ్ల అమ్మా నాన్నలతో పాటు. సెలవల్లో వాళ్ల అమ్మమ్మ వాళ్ల ఊరికి వచ్చాడు. ఇక్కడ తెలుగు నేర్చుకున్నాడు; దావీద్, చిట్టిలతో స్నేహం చేసాడు; ఆ పిల్లల ఇళ్ళలోని కష్టసుఖాలను తెలుసుకుంటూ ఎదుగుతున్నాడు... రచన : అనురాధ నాదెళ్ళ, పోరంకి, కృష్ణాజిల్లా. చిత్రాలు: సుహాసిని, 7 వ తరగతి, రాధ స్కూల్ ఆఫ్ లర్నింగ్, అనంతపురం*

బిట్టు వచ్చి ఇన్ని రోజులైనా వాడు అమ్మ-నాన్నల గురించి పెద్దగా అడగటం లేదు. నాలుగు రోజులకు ఒకసారి తాతయ్య వాడి చేత అమ్మ-నాన్నలకు ఫోను చేయిస్తున్నారు. ఆ నాలుగు రోజుల్లో జరిగిన కబుర్లన్నీ వరస పెట్టి వాళ్లకి చెప్పేస్తూ ఉంటాడు బిట్టు. 'ఇన్ని కబుర్లు ఎప్పుడు నేర్చుకున్నాడమ్మా వీడు? ఇంట్లో ఎప్పుడూ ఇంతగా మాట్లాడడు?!' అన్నది సునంద, తల్లితో.

'అక్కడ ఇంట్లో ఎవరుంటారమ్మా, వాడి

కబుర్లు వినేందుకు? ఇక్కడైతే నలుగురితో కలిసి మెలిసి తిరుగుతాడు. అసలు నీకు తెలీదుగానీ, వాడి పొట్టనిండా కబుర్లే! తాతమ్మకి కొత్త కొత్త కబుర్లు చెబుతాడు; ఢిల్లీ వింతలన్నీ ఇక్కడ వాడి స్నేహితులకి చెబుతాడు..'




తల్లి మాటలు వింటుంటే సునందకి సంతోషం కంటే ఎక్కువ దిగులుగా అనిపించింది- 'ఇక్కడ తను, శివ ఇద్దరూ ఎప్పుడూ బిజీగా ఉంటారు. వాడు చెప్పేది ఇద్దరూ సరిగ్గా వినరు. ఇంట్లో వాడికి ఒక్క తోడు కూడా లేకుండా ఒంటరిగా పెంచుతున్నారు. ఏదో ఈ సెలవల పుణ్యమా అని, వాడికి విశాల ప్రపంచాన్ని చూసే అవకాశం వచ్చింది గానీ..'

కానీ వాడు ఆరోజు ఉన్నట్టుండి 'అమ్మా, నీకు నేనంటే ఇష్టమేనా?' అని అడిగాడు ఫోనులో.

సునంద ఆశ్చర్యపోయింది. 'ఏమైందిరా?' అంది.

'నువ్వు అమ్మమ్మ లాగా రాత్రి పడుకోబోయేప్పుడు కథలు చెప్పవు; నన్నే చదువుకోమంటావు; నువ్వేమో మొబైల్ తో ఎప్పుడూ బిజీగా ఉంటావు; నేను పుస్తకం చదువుకునేప్పుడు ఏదైనా చెప్పమంటే జావేద్ అంకుల్‌ని అడగమంటావు!' అన్నాడు. సునందకి తను చేస్తున్న పొరబాటు అర్థమైంది. 'బిట్టు కనీసం ఇట్లా అడిగాడు కనుక, తను తెలుసుకోగలిగింది. లేకపోతే ఆ అసంతృప్తి వాడికి ఎప్పుడూ ఉండిపోయేది కదా?!' అనుకుంది.

'లేదురా, బిట్టూ, నువ్వు దిల్లీ వచ్చాక మనిద్దరం కలిసి పుస్తకాలు చదువుదాం. నేను నీ కబుర్లన్నీ శ్రద్ధగా వింటాను-సరేనా?'

అన్నది, బిట్టుకి నమ్మకం కలిగేలా.

***

ఆరోజు తాతయ్య స్నేహితులెవరో వచ్చారు. ఆ సందర్భంగా సాయంత్రం చదువు లేదని చెప్పేసారు. పిల్లలు ముగ్గురూ, రెయిన్బో గాడు- అందరూ ఇల్లంతా తిరిగి హడావిడి చేసారు. తాతమ్మ కాస్సేపు వాళ్లని చూసినట్టే చూసి, 'ఒరేయ్ బిట్టూ, ఒకసారి ఇట్లా వచ్చి కూర్చో, ఒకసారి! మీ ఢిల్లీ మన దేశానికే రాజధాని నగరం కదా, అక్కడి విశేషాలు చెప్పు! నేను ఎప్పుడూ వెళ్లనే లేదు మరి!' అంది. బిట్టు ఆశ్చర్య పోయాడు- 'అంత పెద్దదైంది గానీ తాతమ్మ ఇంకా ఢిల్లీ చూడనే లేదు' అని.

'ఢిల్లీ అంటే చాలా పెద్ద ఊరు తాతమ్మా, బోలెడు పెద్ద పెద్ద కార్లు, మెట్రో రైళ్లు ఉంటాయి. దేశంలో ఉన్న అన్ని ప్రాంతాల నుంచీ వచ్చిన వాళ్లు కనిపిస్తారు అక్కడ. మన దేశ ప్రధాని, రాష్ట్రపతి ఇద్దరూ అక్కడే ఉంటారు. దేశానికి కావలసిన అన్ని నిర్ణయాలూ ఢిల్లీలోనే చేస్తారట, అమ్మ చెప్పింది!'




దావీదు, చిట్టి నోర్లు తెరిచి వింటున్నారు.

'ఢిల్లీలో ఎర్రకోట అని ఒక కోట ఉన్నది. దాని మీద ఆగష్టు 15 నాడు జాతీయ జెండా ఎగురవేస్తారు. అప్పుడే కాక, జనవరిలో వచ్చే రిపబ్లిక్‌డే కూడా ఢిల్లీలో చాలా ప్రత్యేకంగా జరుగుతుంది. వేరే వేరే దేశాల నుంచి అధ్యక్షులు, ప్రధానమంత్రులు వస్తారు- మన జాతీయ పండుగ చూసేందుకు!'

'బిట్టూ, నువ్వు ఎప్పుడైనా ఎర్రకోటకి వెళ్లావా? అక్కడ స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలు చూసావా?' ఉత్సాహంగా అడిగాడు దావీదు.

'ఓ, రెండుసార్లు వెళ్ళాను. స్వాతంత్ర

దినోత్సవం నాడు ఎర్ర కోట మీద జెండా ఎగురవేస్తారు మన ప్రధాని. స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న జాతీయ నాయకుల గురించి, వారి త్యాగాల గురించి చెబుతారు. జాతీయ గీతం పాడతారు.



దిల్లీలో గాలిపటాల్ని కూడా ఆ రోజున ప్రత్యేకంగా ఎగుర వేస్తారు. అన్నిచోట్లా రకరకాల కార్యక్రమాలు జరుగుతాయి, ఆ రోజున. మేమందరం మా చొక్కా జేబులకు చిన్న చిన్న జెండాలు తగిలించుకుంటాం కూడా...

మరి మీరు మీ స్కూల్లో రిపబ్లిక్ డే, ఇండిపెండెన్స్ డే ఎలా జరుపుకుంటారు?' అడిగాడు బిట్టు.

దావీదు జవాబిచ్చాడు: 'మా స్కూల్లో కూడా జరుపుతారు, కానీ దానికి మాత్రం నేను ఎప్పుడూ వెళ్లను- ముందు నాలుగురోజుల పాటు పని చేసి, స్కూలునంతటినీ రంగు రంగుల కాగితం జెండాలతో అలంకరిస్తాం. ఆ నాలుగు రోజులూ క్లాసుల గొడవ, పాఠాల గొడవ ఉండదు: హాయిగా ఆడుతూ పాడుతూ సమయం గడపచ్చు! కానీ ఆగస్టు పదిహేనున స్కూలుకి వెళ్లినా ఏముంది, ఏదో ఒక బిస్కెట్ ప్యాకెట్టో, చాక్లెట్టో ఇస్తారు అంతే. అందుకనే నేను హాయిగా 'సెలవు వచ్చింది చాలురా' అని నా నేస్తగాళ్లతో కలిసి ఊరంతా తిరుగుతాను. అయినా మేం కూడా జెండాలు చొక్కాలకి తగిలించుకుంటాంలే. మా అనిల్ గాడైతే వాడి సైకిల్‌కి పెద్ద జెండా ఒకటి పెట్టుకుంటాడు' ఎలాంటి సంకోచమూ లేకుండా చెప్పేసాడు.

చిట్టి చెప్పింది: "నేను మాత్రం స్కూలుకి వెళ్తాను బాబూ! ప్రతి ఏడాదీ స్కూల్లో ఆగస్టు

పదిహేనుకు ముందు జరిపే వ్యాస రచన పోటీల్లోనూ, వక్తృత్వ పోటీల్లోనూ, ఆటల పోటీల్లో కూడా నాకు బహుమతులు వస్తాయి! ఆరోజు నేను, మా స్నేహితురాలు లత- ఇద్దరం వేదిక మీద జాతీయ గీతాలు పాడతాం!" అని.

అది విన్నాక కొంచెం సేపు ఏమీ మాట్లాడలేదు దావీదు. వాడికి తను చేసిన తప్పు అర్థమైంది. 'మళ్ళీ కావాలంటే మాత్రం తనని ఇప్పుడు స్కూలుకి ఎవరు పంపిస్తారు? ఇప్పుడైతే తను కూడా అన్ని పోటీల్లోనూ పాల్గొంటాడు చెల్లి లాగా! పరుగు పందెంలోనూ, కబడ్డీ లోనూ ఐతే తనకి పోటీయే లేదు, స్కూల్లో. అయినా తను ఆడేవాడు కాదు! అట్లా ఎందుకు చేసేవాడో తనకే తెలీదు..'

వాడి ముఖం చూస్తూనే బిట్టుకి అర్థం అయిపోయింది- 'మళ్లీ ఏదో దిగులు పడుతున్నాడు' అని.

'ఏమైంది దావీదూ, నాకు చెప్పు!' అన్నాడు పెద్దవాడి లాగా.

'నిజమేరా బిట్టూ! చెల్లి లాగా నేను బడికి వెళ్ళేవాడిని కాదు. ఎందుకో, మరి నాకే తెలియదు! రాయటం, చదవటం రాదు కదా; అయినా క్లాసులో చెప్పేదేదీ వినేవాడిని కాదు... ఇంక ఇంట్లోనేమో అమ్మ, నాన్న ఎప్పుడూ గొడవపడుతుండేవాళ్లు. నాన్న అమ్మని కొట్టటం, అమ్మ ఏడవటం, అది చూసి చిన్న చెల్లి, తమ్ముడు ఏడవటం.. అబ్బ, చాలా విసుగ్గా ఉండేది! రాత్రి పూట సరిగ్గా నిద్ర కూడా పట్టేది కాదు. ఇల్లు వదిలి వెళ్లిపోదామని అనుకునే వాణ్ణి, చాలాసార్లు. కానీ ఎక్కడికి వెళ్లాలో తెలియదుగా?!' చెబుతున్నాడు సన్నగా, బలహీనంగా ఉన్నదావీదు.

"నిజానికి మొదట్లో చూసిన దావీదు కంటే ఇప్పుడున్న దావీదు కాస్త నయంగానే ఉన్నాడు. ఇక్కడ వాడి అమ్మమ్మ ప్రేమగా తినిపిస్తుంది..వాళ్ల ఇంట్లోలా కాకుండా. వాడి అమ్మమ్మ తాతయ్య వాడిని చాలా ప్రేమగా చూసుకుంటారు. పిల్లలకి ఇచ్చేందుకు, వారిని ఆరోగ్యంగా, ఆనందంగా పెంచేందుకు

ప్రేమని మించినది ఏముంది?" అనుకున్నది, అక్కడే కూర్చొని ఏదో ఎంబ్రాయిడరీ చేసుకుంటూ వాళ్ల మాటలు వింటున్న మణి అమ్మమ్మ.

'పోనీలే, ఇప్పుడు స్కూలు తెరవగానే వెళ్ళు! ఇకనుంచీ స్కూల్లో సరిగ్గా ఉందువు- సరిపోతుంది!' అన్నాడు బిట్టు.

బిట్టు మాటలకి దావీదు పెద్దగా నవ్వేడు. 'అయినా ఇప్పుడు నన్నెవరు పంపిస్తారు, స్కూలుకి? మా అమ్మా-నాన్న అయితే నన్ను పని నేర్చుకొమ్మని పంపించేసారు ఇక్కడికి. ఇప్పటికే పదిహేను ఏళ్లు వచ్చేస్తున్నాయి నాకు- ఇంక స్కూలేమిటి?!' వాడి గొంతులో నిరాశ అందరికీ స్పష్టంగా తెలిసింది.

'ఇక్కడ తాతయ్య చదివిస్తారులే, నిన్ను. ఇప్పుడు సెలవుల్లో చదవటం, రాయటం నేర్చుకుంటున్నావుగా? అందుకని ఇంక క్లాసులో అన్నీ అర్థం అవుతాయి! అదీకాక తాతయ్య నీకు అర్థం కానివి చెబుతారు ఎట్లాగూ' బిట్టు ధైర్యం చెప్పాడు వాడికి.

దావీదు మాట్లాడలేదు. వాడు ఆలోచిస్తున్నాడు: "నన్ను మళ్లీ ఇక్కడ స్కూల్లో చేర్చుకుంటారా?" అని.

తను చదువుకుంటే 'చెల్లెళ్లని, తమ్ముళ్లని ఇంకా బాగా చదివించచ్చు' అని బిట్టు వాళ్ల తాతగారు చెప్పారు కూడా. అందుకని ఇప్పుడు ఇంక రోజూ ప్రొద్దున్నే పనికి వెళ్లి, తాతయ్యకి సాయం చేసి, అటుపైన స్కూలుకెళ్లి బాగా చదువుకోవాలి! తెల్లారగట్ట తన స్నేహితుడొకడు వార్తా పత్రికలు ఇంటింటికీ వేస్తాడు. తను కూడా అలా కాస్త కాస్త సంపాదిస్తూ చదువుకోవాలి...

"మాటలు ఆగాయేం" అనుకుంటూ వాళ్ల వైపు చూసింది అమ్మమ్మ. దావీదు ముఖంలో ఇప్పుడు ఒక పట్టుదల, కష్టపడేందుకు సన్నద్ధత కనిపిస్తున్నాయి. "వీడిని ఇంక వదలకూడదు" నిర్ణయించుకుంది ఆవిడ. "ఈ సెలవుల్లో వీడిని మరింత సాన పట్టాలి. సెలవలు అయిపోగానే మళ్ళీ బడిలో చేర్పించాలి.."



(తరువాతి కథ మళ్ళీ..)




# తుంటరి బాలలు

*ఇతరులు రాసిన కథలు, జోకులు చదువుతూ ఉంటే మనకు కూడా ఇట్లా కథలకు తగిన ఐడియాలు వస్తాయి. ఐతే సొంతంగా కథ రాసినప్పుడు మాత్రం మనకు మనమే పరిశీలించుకోవాలి- పూర్తి సొంతదనంతో కథలు రాయాలి.*

*కథనం: లిఖిత్ కుమార్, 9 వ తరగతి, వివేకానంద ఇం.మీ. స్కూల్, బనిగండ్లపాడు, ఖమ్మం జిల్లా*

*చిత్రాలు: లిఖిత్ , 7 వ తరగతి, రాధ స్కూల్ ఆఫ్ లర్నింగ్, అనంతపురం.*

కొత్తపల్లిలో ఉండే రాఘవరావుకు ఒక కొడుకు, ఒక కూతురు. కొడుకు 'బాల'కు పన్నెండేళ్ళు; కూతురు 'చంద్రిక'కు పదేళ్ళు. కొత్తపల్లిలోనే ఏడో తరగతి చదువుతున్నాడు బాల. చెల్లెలు చంద్రికేమో ఐదవతరగతి.

బాల కాస్త తుంటరి పిల్లాడు. బుడుగు లాంటి మాటలు, చమత్కారపు తెలివితేటలు అతని సొంతం. అతను చేసే అల్లరికి, ఇచ్చే జవాబులకు బళ్లో అందరూ వాడిని 'బాల రామలింగా' అనో, 'బీర్బల్' అనో

పిలిచేవాళ్ళు.

అది సెలవు రోజు. జేజి తాతయ్యని అడిగి డబ్బులు తీసుకెళ్ళి, సందు చివర్లో ఉన్న స్వీట్ షాపులోంచి డజను లడ్డూలు కొనుక్కొచ్చింది చంద్రిక.

కిటికీ సందుల్లోంచి చూడనే చూసాడు బాల. 'తనకి ఒక్కటీ ఇవ్వకుండా లడ్డూలన్నీ ఆ పిల్ల ఒక్కతే తినేస్తుందేమో' అని వాడికి అనుమానం వచ్చింది.

అందుకని, నేరుగా ఆమె దగ్గరకెళ్ళి, ప్రేమ ఒలకబోస్తున్నట్లే "చెల్లీ! నాకు కూడా నాలుగు లడ్డూలు ఇవ్వచ్చు కదా; గేదె తిన్నట్లు ఒక్క దానివే తినకపోతే?!" అన్నాడు.

అట్లా అడిగితే ఎవరైనా ఎందుకిస్తారు? అందుకని వెంటనే చంద్రిక కూడా "ఆ చాల్లే! గుడ్ల గూబ ముఖమూ నువ్వునూ! నాకేదైనా లాభమా నీకు ఇస్తే?! నాకూ లాభం రావాలి కదరా, అన్నయ్యా?!" అంది.

వెంటనే మన వాడి మెదడు కాంతి వేగంతో పని చేసింది. ఇప్పుడు తను వెళ్ళి జేజి తాతయ్యని అడిగినా ఆయన తనకు డబ్బులు ఇవ్వడు. కారణం తను ఎప్పుడూ జేజి గురించి పట్టించుకోడు. తనది నాయనమ్మ పార్టీ. తను ఆవిడ మాటే వింటాడు. అవసరం వచ్చినపుడే మాట్లాడతాడు జేజి తాతయ్యతో. అంతే కాక ఆయన ఏమైనా సాయం అడిగితే కూడా, ఈ తుంటరివాడు సేవ చేయడు.

అందుకని వెంటనే తన తీరు మార్చాడు వాడు: "ఎంత మాట అన్నావు చెల్లెమ్మా! మాటలతోటే పల్టీ కొట్టించావు. సరే, నేను ఓటమిని అంగీకరిస్తాను. మరైతే నేను నాన్నను చమత్కారంగా పల్టీ కొట్టించాననుకో, అప్పుడు మరి నువ్వు తెచ్చుకున్న లడ్డూల్లోంచి నాలుగు లడ్డూలిస్తావా?" అన్నాడు చంద్రికతో.

"ఇంత ముచ్చటగా అడిగావు కాబట్టి, సరే అగ్రజా! ఈ ఒప్పందం నాకు ఒకే" అంది చంద్రిక.

అసలు కథ ఏంటంటే, తను డజను లడ్లు తెచ్చుకునే ముందు జేజి తాతయ్యకు మాట

ఇచ్చింది: "ఆరు నాకు, ఆరు అన్నయ్యకు" అని. 'ఇప్పుడు వీడు నాలుగు చాలు' అంటున్నాడు.. 'మరింకేమి?' అని, ఆ పాప పథకం.




వెంటనే వాళ్ల నాన్న దగ్గరకు వెళ్ళాడు బాల- "నాన్నా ! నీ వెంట్రుకలు ఏమిటో తెల్లబడి పోతున్నాయి. ఎందువల్లంటావు?" అన్నాడు. న్యూస్‌పేపర్ చదువుతున్న తండ్రికి కొడుకు పథకం పూర్తిగా అర్థమైంది.

తను ఏమి అనాలని వాడు ఆశిస్తున్నాడో, ఆ తర్వాత వాడు ఏమి అనబోతున్నాడో కూడా తండ్రికి అర్థం అయ్యింది. అయినా కొడుకు ముచ్చట తీర్చటం కోసం "ఒరేయ్ బాలా! ఏ కొడుకైనా అల్లరి పనులు చేసినా, అబద్ధాలు చెప్పినా, వెంటనే వాళ్ల నాన్న వెంట్రుకలు ఒక్కొక్కటి చొప్పున తెల్లబడిపోతాయి" అని బదులిచ్చి, ముఖాన్ని పేపర్లో దాచుకున్నాడు.

వెంటనే బాల అద్భుతమైన దొంగ సమయస్ఫూర్తితో "అవునా, నాన్నా! నువ్వెన్ని తప్పులు చేసావో, మరెన్ని అబద్ధాలు చెప్పావో కదా మరి, మన జేజి తాతయ్య గడ్డం, మీసాలు, తలవెంట్రుకలు సైతం తెల్లబడిపోయాయి. నాకంటే ఎక్కువ తప్పులు నువ్వే చేసి ఉండాలి కద, నాన్నా?! నక్షత్రకుడిలా మీ నాన్నని పీడించి వుంటావు!" అన్నాడు.

ఈ మాటలకి రాఘవరావు ఖంగు తిన్నట్లుగా నటించాడు. ఆనక తేలుకుట్టిన దొంగ వేషం వేసి, అవాక్కుగా కూర్చుండిపోయాడు.

పక్కనే ఉన్న పరంధామయ్యకు ఈ జోకు పాతదే అని తెలీదు. మనుమడి తుంటరి సమాధానం వాడి సొంత తెలివే

అనుకున్నాడాయన. దాంతో ఉల్లాసంగా బోసి నవ్వులు నవ్వాడు. బాలా వాళ్లమ్మ సుగుణ పగలబడి నవ్వింది. అత్తయ్యకు టీ ఇస్తూ. ఒప్పందం ప్రకారం చెల్లెలు గొల్లున నవ్వుతూనే నాలుగు లడ్డూల్ని వాడికి అందించింది-

అటుపైన, వాడు అటు తిరగ్గానే మిగిలిన ఎనిమిది లడ్డూలనీ తాతయ్యకి చూపించి కన్నుగీటి, ఒక లడ్డూని నేరుగా ఆయన నోటికి అందించింది!

**ఓ మాట...**

కొత్తపల్లిలో పిల్లల రచనలకు ప్రాధాన్యత ఉంటుంది. ఈ పుస్తకంలో దాదాపు సగం కథలు పిల్లలు రాసినవి; మిగిలినవి పిల్లలకోసం పెద్దలు రాసినవి. చాలా కథలకు బొమ్మలు వేసిన వాళ్ళు కూడా పిల్లలే! వాళ్లంతా అనంతపురం రాధా స్కూల్‌లో ఏడు-ఎనిమిది-తొమ్మిదో తరగతులు చదువుతున్నారు. అట్లాగ, అనుకుంటే మీరూ బొమ్మలు వేయచ్చు; మీరూ కథలు రాయచ్చు!

పిల్లలను కలవటం, వాళ్ల చేత తెలుగులో కథలు రాయించటం, బొమ్మలు వేయించటం, వాళ్ళు పంపిన కథల్ని, బొమ్మల్ని సరిదిద్ది మిగతా పిల్లలందరికీ నచ్చేట్లు పుస్తకాలుగా తయారు చేయటం, దానికోసం ఓపెన్ సోర్సు ఉపకరణాలను వాడటం, కథల్ని అందరూ ఉచితంగా చదువుకునేట్లు ఇంటర్నెట్‌లో పెట్టటంతోపాటు, కొన్ని ప్రతులు అచ్చు వేసి, ఇష్టపడిన వాళ్లకు అందించటం మాకు ఇష్టం.

ఈ పనులన్నీ ఎందుకు? ఎందుకంటే ఇవి అందరికీ మేలు చేస్తాయి కాబట్టి! ఇట్లా అందరి మేలూ కోరి చేసే పనుల్లో మీ శక్తి కొద్దీ మీరూ పాలుపంచుకోండి. బాగా చదవండి! బాగా గీయండి! బాగా రాయండి! నవ్వండి! ఆలోచించండి! చక్కగా పాడండి! మంచి పౌరులుగా ఎదగండి!

**పిల్లల కథల ప్రపంచానికి స్వాగతం !**



# చిత్తైన పులి

*రచన: శశిధర్ రెడ్డి, 7 వ తరగతి,తేజ విద్యాలయ, కోదాడ.*

అనగనగా ఒక అడవి, అడవి ప్రక్కనే ఒక ఊరు ఉండేవి. ఆ ఊళ్లో నివసించే రామయ్యకు పెద్ద గొర్రెలమంద ఉండేది. తరతరాలుగా వాళ్ళది అదే వృత్తి. గొర్రెల్ని పెంచటం, అవి ఎదిగినాక మంచి ధరకు అమ్మటం. చాలా ఏళ్ళపాటు అతని వ్యాపారం బాగానే సాగింది- అయితే కొంతకాలంగా అదంతా కష్టాల్లో పడింది.

ఆ కష్టాలకు కారణం ఒక చిరుతపులి.

ఆ చిరుతపులి అడవిలో తిరుగాడేది; రోజూ రాత్రిపూట వచ్చి, ఒకటి రెండు గొర్రెలను ఎత్తుకెళ్ళేది. రామయ్య దాన్ని గురించి అటవీశాఖ వాళ్లకు ఎన్ని సార్లు ఫిర్యాదు చేసినా ఫలితం లేకపోయింది. అట్లా అని దాన్ని చంపటమేమో నేరం!

అయినా "ఏదైతే అదౌతుంది- పులిని చంపేస్తాను" అని రామయ్య ఎంత ప్రయత్నించినా, ఎన్ని రకాలుగా మాటు

వేసినా, చిరుతపులి మాత్రం తెలివిగా ఎలాగోలా కనీసం ఒక గొర్రెనైనా తిని పోతూనే ఉంది. దాంతో రామయ్య వ్యాపారం, దానితో పాటు ఆరోగ్యం కూడా దెబ్బతిన సాగినై.



"ఈ పులి బాధనుండి తప్పించుకోవటం ఎలా?" అని సతమతమౌతూండగా, దేవుడు పంపించినట్లు వాళ్ళ అన్నయ్య వచ్చాడు ఊరికి.

రామయ్య శరీరపు తీరుని, అనారోగ్యాన్ని గమనించి "ఏమైందిరా?" అని అడిగాడు. రామయ్య చెప్పింది అంతా విని, "నాకు తెలుసు, ఏం చేయాలో!" అన్నాడు అన్నయ్య.

ఆ రోజు రాత్రి చిరుతపులి ఎప్పటిలాగే గొర్రెలను తిందామని వచ్చింది. ఆరోజున దానికి అక్కడ పుష్టిగా ఉన్న గొర్రెలు చాలా కనిపించాయి. అవన్నీ ఒకదానినొకటి ఆనుకొని నిలబడి ఉన్నాయి. పులి తటాలున ఒక గొర్రె మీదికి దూకి, దాని మెడను పట్టుకొని కొరికేసింది. మామూలుగా అది ఒక గొర్రెమీదికి దూకగానే మిగతా గొర్రెలన్నీ ప్రాణభయంతో అరుస్తూ పారిపోయేవి. కానీ ఆరోజున అవేవీ పారిపోలేదు.

నిశ్శబ్దంగా అలాగే దానికేసే చూస్తూ నిలబడ్డాయి. చిరుతపులికి ఏమీ అర్థం కాలేదు. 'ఇవాళ్ల నేను రెండు గొర్రెల్ని ఈడ్చుకు పోతాను" అని అది వెంటనే మరో గొర్రె మీదికి దూకి, దాని మెడను పట్టుకొని చీల్చివేసింది. అయితే అదేం చిత్రమో, సరిగ్గా అదే క్షణానికి దానికి కళ్ళు తిరిగినట్లయింది!

"ఏమౌతున్నది?" అనుకునేలోగానే దానికి ఎక్కడ లేని మైకం వచ్చి, తటాలున పడిపోయింది.

అంతలోనే ప్రక్క గదిలోంచి వచ్చిన

రామయ్య, వాళ్ల అన్నయ్య ఇద్దరూ తాము తెచ్చిన తాళ్లతో పులి కాళ్ళు, నోరు అన్నీ కట్టేసారు. పులికి అన్నీ తెలుస్తూనే ఉన్నాయి, కానీ ఏమీ చెయ్యలేక ఊరుకున్నదది!



తెల్లవారాక, పులిని అటవీ శాఖ వారికి అప్పజెప్పారు రామయ్య, అన్నయ్య. వాళ్ళు వచ్చి, పులిని బోనులో పెట్టుకొని తీసుకుపోయారు.

ఇంతకీ అన్నయ్య ఏం చేసాడు?

ఆరోజు ఉదయం అంతా కూర్చొని దూదితో ఒక పదికి పైగా గొర్రెల్ని చేయించాడు. వాటి మెడ దగ్గర మటుకు గొర్రె మాంసపు ముక్కలు పెట్టి కుట్లు వేయించాడు. మాంసంలోను, గొర్రె బొమ్మల మెడల దగ్గర కూడాను, అంతటా దట్టంగా మత్తు మందు చల్లించాడు.

ఇక ఆరోజు రాత్రి నిజం గొర్రెలన్నింటినీ పాకలోంచి రామయ్య పడుకునే గదిలోకి తెచ్చి, తలుపులు, కిటికీలు అన్నీ బిగించాడు. పులి అలవాటుగా అవి ఉండే పాకలోకే వెళ్ళి, అక్కడ ఉన్న గొర్రె బొమ్మల్ని చూసి, నిజం గొర్రెలు అనుకున్నది. నిజంగానే మరి, అది కొరికిన చోటల్లా గొర్రె మాంసమే ఉందాయె! అట్లా మత్తు మందు ప్రభావానికి గురైన పులి, రెండో గొర్రెను కొరకటం వరకూ చేయగలిగింది గానీ, ఆ తర్వాత ఇక తట్టుకోలేక పడిపోయింది! ఆ రకంగా అది అత్తవారింటికి- అంటే అటవీ శాఖవారి సంరక్షణ శాలకు- చేరుకున్నది!

ఇక అటుపైన రామయ్య గొర్రెల వ్యాపారం దిన దినాభివృద్ధి చెందింది.






# కండబలం - బుద్ధిబలం

*"కండబలంతో సాధించలేని పనుల్ని చాలావాటిని బుద్ధిబలంతో సాధించచ్చు" అంటోంది దుర్గాభవాని. అంటే దాని అర్థం కండబలం అక్కర్లేదని కాదు: 'అదీ ఉండాలి; ఇదీ ఉండాలి' అనమాట!*

*రచన: దుర్గా భవాని, 7 వ తరగతి, క్రాస్ వర్డ్‌స్కూల్, గుంటూర్.*

*చిత్రాలు:పూజిత, 7 వ తరగతి, రాధ స్కూల్ ఆఫ్ లర్నింగ్, అనంతపురం.*

శివపురంలో అంజన్న, శివన్న అనే ఇద్దరు మిత్రులు ఉండేవాళ్ళు. వాళ్లది విడదీయరాని స్నేహబంధం. అంజి పొడవుగా, బలంగా ఉండేవాడు. ఇక శివకేమో లోకజ్ఞానం ఎక్కువ.

"నీకేమిరా, కొండలు పిండి చేసైనా అమ్ముతావు" అనేవాడు శివ. "నీకూ ఏమీ నష్టం లేదు. బలం లేకపోయినా, నీకున్న తెలివితేటలతో ఎక్కడైనా బతికేస్తావు" అనేవాడు అంజి. "ఇద్దరూ కలిస్తే ఇంకెవరూ వీళ్లని ఏమీ చేయలేరబ్బా!" అనుకునేవాళ్ళు ఊళ్ళో వాళ్ళు.

శివపురంలో దసరా పండగ బాగా జరుపుకుంటారు. పండగకు అవసరమయ్యే సామాన్లు తెచ్చి అమ్మితే ఈ సమయంలో బాగా లాభాలు వస్తాయి. అందుకని, ఇంకో నాలుగు రోజుల్లో దసరా పండగ రానున్నదనగా, అంజి, శివ ఇద్దరూ చేతికందిన మొత్తాలు పట్టుకొని పారుగూర్లో జరిగే సంతకు బయలుదేరారు.




ఆ రోజుల్లో ఇప్పటిలాగా తారు రోడ్లు అవీ లేవు. పారుగూరు వెళ్ళాలంటే ఊరికే కాదు: అడవి మార్గంలోనుంచి వెళ్ళాలి! దారి దోపిడి దొంగలు, క్రూర మృగాల బెడద బాగా ఉంది. అయితే వీళ్ళిద్దరికీ అవి సమస్యలు అనిపించలేదు. కండబలం, బుద్ధిబలం రెండూ ఉన్నవాళ్ళాయె!

అట్లా అడవిలోంచి పోతూ ఉంటే వాళ్ల వెనకాల ఏదో అలికిడి అయ్యింది. వాళ్లని ఎవరో అనుసరిస్తున్నారు! "ఎవరై ఉంటారు?" అని ఆలోచించిన శివకి వాళ్ళు దొంగలే అని నిశ్చయంగా అనిపించింది. 'దొంగలు చాలామందే ఉన్నట్లున్నారు. వాళ్లతో పోరాటం చేస్తే కూడా పెద్ద ప్రయోజనం ఉండకపోవచ్చు..'

శివకి వెంటనే ఒక ఐడియా వచ్చింది. అతను నడుస్తూనే క్రిందికి వంగి, చేతినిండా గులకరాళ్ళని, మట్టిబెడ్డల్నీ తీసుకుని, గబగబా వాటిని తన దగ్గరున్న ఒక గుడ్డలో చుట్టి చటుక్కున జేబులో పెట్టుకున్నాడు.

అటుపైన అతను అంజీతో గట్టిగా మాట్లాడటం మొదలెట్టాడు: "ఒరేయ్, అంజీ! మన దగ్గర ఇన్నిన్ని డబ్బులున్నాయి కదరా! మనల్ని ఎవరైనా దోచుకుపోతే ఎలాగ?!" అని.

"మన దగ్గరికి ఎవరూ రారులేరా! ఇంత పెద్ద శరీరాన్ని చూసి భయపడతారులే, వాళ్ళు!" అన్నాడు అంజి, సంగతి అర్థంకాక.

"అయినా ఎక్కువమంది వచ్చారనుకో, నిన్నూ నన్నూ కట్టి పడేస్తారు, అప్పుడింక ఏం చేస్తాం? అందుకని ఓ పని చేద్దాం. సంతలో మనకు ఏమన్ని డబ్బులు అవసరం ఉండదు కాబట్టి, ఊరికే ఏ పదో పరకో మన దగ్గర పెట్టుకొని, మిగిలిన సొమ్ములన్నీ ఎప్పటిమాదిరి ఇదిగో, ఈ చెరువులో పడేద్దాం: తెలిసిన చెరువే కనుక, మళ్ళీ మనం వెనక్కి వచ్చేటప్పుడు చెరువులోకి దిగి మన మూటని మనం తీసుకుంటే సరిపోతుంది" అన్నాడు శివ.

అంజికి తిక్క పట్టినట్లయింది. శివ ఏమంటున్నాడో అతనికి అర్థమే కాలేదు. "అయినా మిత్రుడు అట్లా అన్నాడంటే ఏదో ఉన్నట్లే కదా" అని తనకు కూడా ఏదో అర్థం అయినట్టే తల ఊపాడు.

దాంతో శివ ముందుకొచ్చి, మిత్రుడి జేబులోంచే తీసినట్లుగా రాళ్ళ మూటను బయటికి తీసి, దాన్ని నదిలో గిరాటు వేసాడు- "గంగమ్మ తల్లీ! ఎప్పటిమాదిరే డబ్బులు నీ దగ్గర వదిలి వెళ్తున్నాం. మళ్ళీ వెనక్కి వచ్చేటప్పుడు తీసుకుంటాం తల్లీ! ఈ మాత్రం సాయం చెయ్యి!" అంటూ.




వాళ్ళు అటు వెళ్ళగానే ఇక ఆలస్యం చేయకుండా దొంగలు నలుగురూ చెరువులోకి దూకారు.

అంజి, శివ ఇద్దరూ మరే సమస్యా లేకుండా సంతకు చేరుకున్నారు. ఏడు ఊళ్లకి ఒకటే సంత అది- చాలా పెద్ద సంత. తమకు కావలసిన సరుకులన్నీ కొనుక్కున్నారు మిత్రులిద్దరూ.

ఇంకా ఒక్క మేకపోతును మాత్రం కొనవలసి ఉన్నది. ఆ సంతలోనే ఒక ప్రక్కగా పశువులు-జంతువుల సంత జరుగుతుంది.

మిత్రులిద్దరూ అందులోకి ప్రవేశించారు.

అక్కడ ఒక దుకాణంలో వాళ్ళిద్దరికీ నచ్చిన మేకపోతు ఒకటి కనిపించింది. కొమ్ములు మెలిక తిరిగి, మెరిసే బొచ్చుతో నిండుగా ఉన్న ఆ మేకపోతుని చూస్తే అంజికి, శివకి చాలా ముచ్చట వేసింది.




"ఇది బలే ఉందిరా! కొంటే ఈ పోతునే కొనాలి!" అంటూనే పోయాడు అంజి, ఆ దుకాణాదారు ముందు. "మాట్లాడకు!" అని శివ ఎన్ని సైగలు చేసినా ప్రయోజనం లేకపోయింది. దాంతో వీళ్లెవరో పల్లెటూరివాళ్ళు- ఎంత ధర చెప్పినా కొనేట్లున్నారని, దుకాణదారు రేటును చెట్టెక్కించాడు: అసలు ధరకు రెట్టింపు రేటు చెప్ప సాగాడు. "అంత రేటు ఎందుకు?" అంటే "ఇది దేవతా మేక" అనసాగాడు!

"వద్దులేరా! మనకు ఈ మేకపోతు వద్దు. వేరే ఎక్కడైనా మామూలుది కొనుక్కుందాం" అని శివ అంటే "కాదు, ఇదే కావాలి!" అని మొండికేసాడు అంజి!

దాంతో శివ అతన్ని బలవంతంగా అక్కడినుండి దూరం తీసుకొచ్చి, "ఒరే! కొందరు దుకాణాలవాళ్ళు నిజాయితీగా ఉంటారు. ఎవరొచ్చినా ఒకే రేటు చెబుతారు. కొందరు ఇతనిలాగా, మనిషికో రేటు చెబుతారు. అదే తెలివనుకుంటారు. అట్లాంటివాళ్లముందు మనం వస్తువులు నచ్చినా నచ్చనట్లే ఉండాలి" అని నచ్చ జెప్పాడు.

"అయినా మనం ఆ మేకపోతునే కొనాలి" అని పంతం పట్టాడు అంజి. దాంతో శివ కొంచెం ఆలోచించి, "సరే! నువ్వు ఎక్కువ మాట్లాడకు- నేను ఎట్లా చెబితే అట్లా చెయ్యి" అని కొంచెం అవతలగా ఉన్న దుకాణానికి పోయి ఒక బాతు గుడ్డును కొనుక్కొచ్చాడు. దానికి బంగారు రంగు

పూసాడు. రంగు ఆరాక, దాన్ని చేత పట్టుకొని, మేకపోతు దుకాణదారు దగ్గరికి పోయాడు.

అతనికి తన చేతిలోని గుడ్డును చూపిస్తూ- "మిత్రమా! నిజంగా మాట్లాడితే నీ మేక మాకు అవసరంలేదు. మాకు బంగారు గుడ్లు పెట్టే బాతొకటి ఉంది. రోజుకో గ్రుడ్డు ఇస్తుందది. అసలైతే ఆ గ్రుడ్డును అమ్ముకునేందుకు వచ్చాం, సంతకి. ఇప్పుడు మేం దీన్ని ఇక అమ్మం. దీన్నే పొదగ పెడతాం. బంగారు బాతు పిల్లలు ఎట్లాగూ పుడతాయి. రోజూ ఓ పదో పన్నెండో బంగారు గుడ్లు వస్తే ఇంకేమి, మేం కోటీశ్వరులం అవుతాం, త్వరలోనే. అందుకని, నీ మేకపోతును ఏదో ఒక రేటుకు ఇచ్చెయ్యి పర్లేదు.." అని ఏదేదో చెప్పసాగాడు.

దుకాణదారుకి 'వీడు ఏదో తెలివిని చూపిస్తున్నాడు' అని అర్థమైంది, కానీ కిటుకు ఏంటో ఎంత ఆలోచించినా అర్థం కాలేదు.

"ఏదీ- ఆ గ్రుడ్డును ఓసారి చూపించు" అని మాత్రం అన్నాడు. ఆ అవకాశం కోసమే ఎదురు చూస్తున్న శివ, దాన్ని దుకాణదారు చేతిలో పెట్టినట్లే పెట్టి, గ్రుడ్డును క్రిందికి వదిలేసాడు! గ్రుడ్డు పగిలి అందులోని సొన అంతా నేలమీద పడింది.




శివ కనుసైగ చేయగానే అంజి ఏడుస్తూ గట్టిగా అరవటం మొదలెట్టాడు: "మా బంగారు బాతు గుడ్డు! నువ్వు పగల గొట్టావు!" అంటూ.

జనాలు అంతా చుట్టూ మూగారు. శివ, అంజి తమ నాటకాన్ని రక్తి కట్టిస్తూ, "ఇది మామూలు గుడ్డు కాదు! బంగారు గ్రుడ్డు! దాన్ని ఇతను పగల గొట్టాడు- కాబట్టి దాని

మూల్యం చెల్లించాల్సిందే" అని అరవసాగారు.

చివరికి, అందరి జోక్యంతోటీ, దుకాణదారు తన మేకపోతును సగం ధరకే వాళ్ల పరం చేసి, నోరు మూసుకొని ఇంటికి పోవలసి వచ్చింది! మిత్రులిద్దరూ విజయగర్వంతో మేకపోతును, సామాన్లను తీసుకొని వెనక్కి బయలు దేరారు.

ఇక అడవిలో దొంగలు చెరువు మొత్తం గాలించి, గాలించి చివరికి ఆ మూటని పట్టుకున్నారు. అయితే దాన్ని తెరిచి చూస్తే అందులో ఒట్టి గులకరాళ్ళున్నాయి. దాంతో వాళ్లంతా మండి పడ్డారు: "ఆ ఇద్దరూ ఎక్కడికీ పోలేరు! ఇటే తిరిగి వస్తారు! అప్పుడు వాళ్ళ దగ్గర ఉన్న సొమ్ము, సామగ్రి మొత్తం మన సొంతం చేసుకుంటాం!" అని ప్రతిజ్ఞలు చేసారు.

కులాసాగా మేకపోతుతో పాటు వెనక్కి తిరిగి వస్తున్న శివని, అంజిని వాళ్ళు చూడనైతే చూసారు కానీ, అంజి కండల్ని చూసి వాళ్ల మీదికి దూకేందుకు కొంచెం జంకారు. అప్పుడు వాళ్లలో ఒకడు "అన్నా! వీళ్ళేదో తెలివైనవాళ్ళనుకుంటున్నారు. వీళ్లని తెలివితోటే మోసం చేస్తాం! ఆగండి!" అని తన ఆలోచన చెప్పాడు. అందరూ "సరే సరే" అన్నారు.




అట్లా మిగిలిన వాళ్లంతా పొదలమాటునుండి పొంచి చూస్తూండగా ఒక దొంగ మటుకు ముందుకు వచ్చి, శివ వాళ్ళతో పాటు నడుస్తూ "ఎక్కడ దొరికిందయ్యా, మీకు ఈ పంది?!" అని అడిగాడు. శివకు దొంగల పథకం చటుక్కున అర్థమైంది.

వెంటనే అతను సమయ స్ఫూర్తితో "ఏంటి, ఈ విడ్డూరం?! ఇది నీకు పందిలా కనపడుతూందా?! నిజానికి వీడు ఒక

దొంగ. దారిలో మమ్మల్ని చంపేందుకు ప్రయత్నించాడు. వాడిని చంపటం మాకు ఓ లెక్క కాదు; కానీ ఎట్లాగైనా బంధించి, మచ్చిక చేసుకొని, వాడిచేత ఊడిగం చేయించుకోవాలని మా ఆలోచన. అందుకే ఇదిగో, ఇట్లా మార్చి, వెంట తీసుకెళ్తున్నాం. అయినా మీరు పెంచుకుంటామంటే దానిదేముంది, వీడిని మీకు ఇచ్చేస్తాం!" అన్నాడు.

దొంగ బిత్తర పోయాడు. అయినా తేరుకొని, నవ్వు ముఖంతో "బాగుందే! మీరు చూస్తే మంచి వీర యోధుల్లానే ఉన్నారే! దొంగల్ని కూడా మచ్చిక చేసుకుంటారా, మీరు?" అన్నాడు.

"ఓ, నిజానికి జంతువుల్ని మచ్చిక చేసుకోవటం కంటే దొంగల్ని మచ్చిక చేసుకోవటమే చాలా తేలిక. మా గురువుగారు మాకో ఛాలెంజ్ పెట్టారు. ఐదుగురు దొంగల్ని మచ్చిక చేసుకొని తెస్తే తప్ప, మా చదువు ముగిసినట్లు కాదని. ఇదిగో, ఇప్పటికి ఒక దొంగ లెక్క తేలాడు. మరో నలుగురికోసం వెతుకుతున్నాం. ఆ కనబడే పొదల్లో అలికిడి అవుతున్నది చూసావా, అక్కడే ఎవరో దొంగలు నక్కి ఉన్నారని నా అనుమానం. అయితే వాళ్ళు ధైర్యం చేసి మా మీదికి వచ్చే వరకూ మేం ఏమీ చేయటానికి లేదు. అందుకనే ఆలోచిస్తున్నాను" అన్నాడు శివ నవ్వు ముఖం పెట్టి.

ఆ పొదల్లోనేగా తమ వాళ్ళున్నది?! దాంతో దొంగవాడికి భయం వేసింది. "మీరు బలే ఉన్నారు. వస్తా" అని చెప్పి సులభంగా తప్పించుకు పోయి, "అబ్బాయిలూ! వీళ్లెవరో మరీ ప్రమాదకరంగా ఉన్నారు. వీళ్లని వదిలేద్దాం- వేరే ఎవర్నైనా పట్టుకోవచ్చు బ్రతికుంటే" అని తమ వారినందరినీ తిరిగి అడవిలోకి తీసుకెళ్ళిపోయాడు.

"పద పద- వాళ్ళు మనసు మార్చుకునేలోపల మనిద్దరం ఊరు చేరాలి" అని గబగబా నడిచి, క్షేమంగా శివపురానికి చేరుకున్నారు మిత్రులిద్దరూ.





# మంచితనం

*రచన: శాఖమూరి వివేక్, 4 వ తరగతి, కృష్ణవేణి టాలెంట్ స్కూల్, యర్రగొండపాలెం, ప్రకాశం జిల్లా*
*చిత్రాలు: పి.శిల్ప, 9 వ తరగతి, రాధ స్కూల్ ఆఫ్ లర్నింగ్, అనంతపురం.*



అడవిలో ఎలుగుబంటి ఒకటి ఉండేది. ఒకసారి అది తేనె కోసం వెతుకుతూ ఉంటే, చెట్టుపైన ఓ పెద్ద తేనెపట్టు కనిపించింది.

ఆ తేనెపట్టులోంచి తేనె కారుతోంది! కొంచెం కొంచెంగా, చెట్టు క్రిందికంటా కారుతోంది. ఎలుగుబంటి ఇంక ఊరుకుంటుందా? వెళ్ళి దానిని నాకటం మొదలు పెట్టింది.




అది చూసాయి తేనెటీగలు! 'అమ్మో! ఈ ఎలుగుబంటి తేనెను నాకి ఊరుకోదు. మళ్ళీ చెట్టెక్కుతుంది. మన తేనెపట్టును పట్టుకొని, దాన్ని పిండి తినేసేటట్లుంది!' అనుకొని, దాని మీదికి దూకి కుట్టసాగాయి.

అది గమనించిన ఎలుగుబంటి చేతికందిన రాళ్ళను, ఆకుల్ని, చెత్తను, చెట్టుకొమ్మల్ని వాటి మీదకు విసిరేస్తూ గంతులు వేసింది. తేనెటీగలేమో వాటినుండి తప్పించుకొని దూరంగా ఎగురుతూ, మళ్ళీ తిరిగి వచ్చి దాన్ని కుడుతూ పోయాయి.




కొద్ది సేపటికి ఎలుగుబంటేమో తేనెటీగల్నుంచి తప్పించుకొని పారిపోయింది. కానీ 'బుల్లి' అనే తేనెటీగకు ఎలుగుబంటి వేసిన రాయి తగిలింది పాపం. దాని రెక్క కాస్తా విరిగి వేలాడసాగింది. అది నేలమీద పడిపోయింది. తేనెటీగలన్నీ దాన్ని చూసాయి కానీ, ఏమీ చెయ్యలేక ఊరుకున్నాయి.

అయితే కొద్ది సేపటికి తిరిగి వచ్చింది ఎలుగుబంటి! అది వచ్చీ రాగానే అటూ ఇటూ చూసి, బుల్లిని తీసుకెళ్ళి తన గుహలో ఒకచోట పెట్టింది. దానికి రోజూ ఆహారం పెట్టింది. ఏవో ఆకుల్ని తెచ్చి పిండేది దాని రెక్కమీద. అట్లా కొన్ని రోజులు గడిచే సరికి బుల్లి రెక్క

అతుక్కున్నది! అది ఎగరగలిగే స్థితికి రాగానే ఎలుగుబంటి దాన్ని విడిచిపెట్టింది.

బుల్లి తన బంధువుల దగ్గరికి వెళ్ళి ఎలుగుబంటి మంచితనం గురించి చెప్పింది.

అప్పుడు 'మనం ఎలుగుబంటిని కుట్టిపెట్టినా గానీ, మనసులో ఉంచుకోకుండా మన బుల్లిని కాపాడింది- ఈ ఎలుగు బంటి ఏదో పాపం మంచిదే!' అనుకున్నాయి తేనెటీగలు. అవన్నీ ఎలుగుబంటి దగ్గరకు వెళ్ళి క్షమాపణ కోరాయి. తాము సేకరించిన తేనెను ఎలుగుబంటికి బహుమతిగా ఇచ్చాయి. చూస్తూండగానే ఎలుగుబంటి, తేనెటీగలు మంచి స్నేహితులైపోయాయి!



**పొడుపు కథలు:**

1. ఓహోయి రాజా! ఒడ్డు పొడుగేమి? పట్టుకోబోతే పిడికెడు లేదు?!
2. కాళ్లు లేవు గానీ నడుస్తుంది. కళ్లు లేవు గానీ ఏడుస్తుంది. ఏంటది?
3. తలుపుల సందున మెరుపుల గిన్నె- ఏంటది?
4. తల్లి దయ్యం, పిల్ల పగడం!
5. తెల్లకోటు తొడుక్కున్న ఎర్రముక్కు దొర!

6.ఒకటే తొట్టి, రెండు పిల్లలు!

7.చూస్తే చూసింది గాని కళ్లు లేవు. నవ్వితే నవ్వింది గాని పళ్ళు నోరు లేదు, తంతే తన్నింది గాని కాలు లేదు. ఏంటది?!

8.చూస్తే చిన్నోడు, వాడి ఒంటి నిండా నార బట్టలు. ఏంటబ్బా, అది?!

9.తల నుండి పొగ చిమ్ముతుంది, భూతం కాదు. కన్నులెర్రగా ఉండు కానీ రాకాసి కాదు. పాకిపోవుచుండు గాని పాము కాదు. మరేమిటది?

10.నూరు పళ్లు, ఒకటే పెదవి. ఏమది?

*జవాబులు: 1. పొగ 2. మేఘం 3. దీపం 4. రేగుపండు 5. కొవ్వొత్తి 6. వేరుశనగ 7. అద్దం 8. టెంకాయ 9. రైలు 10. దానిమ్మ*




# నక్క తిక్క కుదిరింది

*రచన: హర్షసాయి, 5 వతరగతి, వికాస విద్యావనం, పోరంకి, కృష్ణాజిల్లా.*

*చిత్రాలు: ధరణి, 7 వ తరగతి, రాధా స్కూల్ ఆఫ్ లర్నింగ్, అనంతపురం.*

అనగనగనగనగా ఒక అడవి. ఆ అడవిలో రకరకాల జంతువులు ఉండేవి. పెద్ద కుందేళ్ళ గుంపు కూడా ఒకటి ఉండేది వాటిలో.

ఒకరోజున ఆ కుందేళ్ళ దగ్గరికి నక్క ఒకటి వచ్చింది. "ఈ విషయం తెలుసా, మీకు?! మన సింహరాజుగారికి ఏదో పెద్ద జబ్బు చేసింది. రాజ వైద్యులు కోతిగారు ఆయనకు మందులిస్తున్నారు. ఆయన చెప్పారు 'రోజూ ఓ కుందేలును ఆహారంగా తీసుకుంటే రాజుగారికి మంచిది; ఆరోగ్యం చక్కగా కుదురుకుంటుంది' అని. అందుకని మిమ్మల్ని రోజుకొకరుగా తీసుకు రమ్మని రాజాజ్ఞ!" అని చెప్పింది.

కుందేళ్లకు మతిపోయింది. "రాజుగారి రోగం-కుందేళ్లకు శాపం" అని అన్నీ విచారపడి, రాత్రికి రాత్రే ఓ సమావేశం ఏర్పాటు చేసుకున్నాయి.

"మనం ఎవ్వరం దొరకకుండా

తప్పించుకుందాం. ఆయన ఏం చేస్తాడో చూద్దాం" అన్నాయి కొన్ని కుర్ర కుందేళ్ళు.

ముసలి కుందేళ్లు వాటిని కసిరి "రాజుగారికి కోపం వస్తే మనందరినీ ఒకేసారి చంపేయగలడు. కాబట్టి మనమే మర్యాదగా ఒక్కొక్కరం వెళ్ళడం మంచిది. అయినా రాజుగారి ఆరోగ్యం కంటే మించింది ఏముంటుంది పౌరులకి? మీ కుర్ర కుందేళ్లకు ఏమీ తెలీదు ఊరుకోండి. మేం పెద్దవాళ్ళం వెళ్తాం, రోజుకొకరం! ఒక వారం రోజుల్లో ఆయన ఆరోగ్యమూ కుదురుకుంటుంది; మీకు ఈ శ్రమా తప్పుతుంది" అన్నాయి.

కుర్ర కుందేళ్లకు ఆ మాటలు నచ్చలేదు గానీ, పెద్దల మాటకు ఎదురు చెప్పలేక ఊరుకున్నాయి. అట్లా ఆ మరుసటి రోజునుండి ప్రతిరోజూ తెల్లవారుతుండగానే నక్క వచ్చేది: తనతోబాటు ఒక కుందేలును వెంటబెట్టుకు వెళ్ళేది. ఇట్లా ఒక వారం రోజులు గడిచాయి.

ఆ రోజున కుందేళ్లకు కోతి ఎదురైంది అడవిలో . దాన్ని చూడగానే కుందేళ్లకు తమ సమస్య, అది ఎప్పటికి పరిష్కారం అవుతుందోనన్న బెంగ గుర్తుకొచ్చాయి. వెంటనే అవన్నీ నేరుగా కట్టకట్టుకున్నట్టు కోతి దగ్గరికి వెళ్ళి, "రాజుగారికి జబ్బు తగ్గిందా?" అని అడిగాయి. కోతి ఏమీ అర్థం కానట్లు ముఖం పెట్టింది: "రాజుగారికేం? చక్కగా ఉన్నారు. ఆయనకేం జబ్బు?! రాజవైద్యుడిని, నాకు తెలీని జబ్బులు ఏమొచ్చినై, ఆయనకు? ఈ పుకార్లు ఎవరు రేపుతున్నారో కనుక్కోవాలి. ఇంతకీ ఆయనకు జబ్బుచేసిందని ఎవరు చెప్పారు, మీకు?!" అని అడిగింది చికాకుగా.

కుందేళ్లన్నీ ఆశ్చర్యంతో నోళ్ళు తెరిచాయి. "ఓహో! ఇవన్నీ నక్క జిత్తులనమాట! సింహానికి ఆరోగ్యం బానే ఉంది. అయినా నక్క తమకు అబద్ధం చెప్పింది! రోజూ కుందేలునొకదాన్ని తీసుకు వెళ్తుంటే 'సింహం కోసమే కదా' అనుకున్నాంగానీ, నిజానికి దారిలోనే ఆ కుందేలును చంపి తిని ఆకలిని తీర్చుకుంటోందనమాట,ఈ జిత్తులమారి నక్క! ఆ ఆలోచనతో కుందేళ్ల గుండెలు

దహించుకు పోయాయి.

అంతలోనే అటుగా వచ్చింది నక్క. ఏంటి అల్లుళ్ళూ! ఏదో మీటింగు పెట్టుకున్నట్టున్నారే, మంచినీళ్ల బావి దగ్గర!" అంటూ.




కుందేళ్ళు ఒకదాని ముఖం ఒకటి చూసుకున్నాయి. ఓ ముసలి కుందేలు గట్టిగా నవ్వి, నక్కతో "నక్కబావా! నీకు నూరేళ్ళు నిండుతున్నట్లున్నాయి- ఇప్పుడే మేమంతా నీ గురించి మాట్లాడుకున్నాం; అంతలోనే నువ్వు వచ్చేసావు! ఎట్లాగూ వచ్చావు కాబట్టి మా తాడు లాగే ఆటలో నువ్వూ కలువు. తాడును మా కుర్రవాళ్లంతా ఒక వైపు పట్టుకొని లాగుతారు; నువ్వు ఒక్కడివే ఒక వైపు పట్టుకొని లాగు. ఎదుటి వాళ్లను ఎవరైతే తమ వైపు లాగేసుకుంటారో వాళ్ళు గెలిచినట్లు. నీకు కూడా తెలుసుగా ఈ ఆట?!" అన్నాయి.

"ఓ! తెలియకేమి? నేను ఒక్కడినీ చాలు, మిమ్మల్ని అందరినీ గెలిచేందుకు. కానివ్వండి మరి!" అన్నది నక్క.

కుర్ర కుందేళ్ళన్నీ తాడుని గట్టిగా పట్టుకున్నాయి ఒకవైపున. మరోవైపున నక్క; వాటన్నిటినీ తనవైపు లాగేయాలని చాలా బలంగా లాగసాగింది. కొంత సేపు ఆట రంజుగా సాగింది. చూస్తున్న కుందేళ్ళన్నీ ఉత్సాహంగా కేకలు పెట్టాయి. నక్క తనని తాను మర్చిపోయి, శక్తినంతా వెచ్చించి లాగుతున్నది. 'అన్నీ సరిగా ఉన్నాయి' అన్నప్పుడు, ముసలి కుందేలు సైగను అందుకొని, కుందేళ్ళన్నీ ఒకేసారి తాడును వదిలేసాయి! అంతే! నక్క, విసిరేసినట్టుగా వెళ్ళి వెనకాల ఉన్న బావిలో పడిపోయింది తాడుతో సహా.

మోసపు నక్క పీడ విరగడైనందుకు కుందేళ్ళన్నీ పండగ చేసుకున్నాయి.

## మీ పుస్తకాలకోసం లేబుల్స్

కొత్తపల్లి



పేరు: ____________________

తరగతి:______సెక్షన్:________

స్కూల్:_________________

సబ్జెక్టు:__________________

కొత్తపల్లి



పేరు: ____________________

తరగతి:______సెక్షన్:________

స్కూల్:_________________

సబ్జెక్టు:__________________

కొత్తపల్లి



పేరు: ____________________

తరగతి:______సెక్షన్:________

స్కూల్:_________________

సబ్జెక్టు:__________________

కొత్తపల్లి



పేరు: ____________________

తరగతి:______సెక్షన్:________

స్కూల్:_________________

సబ్జెక్టు:__________________

కొత్తపల్లి



పేరు: ____________________

తరగతి:______సెక్షన్:________

స్కూల్:_________________

సబ్జెక్టు:__________________

కొత్తపల్లి



పేరు: ____________________

తరగతి:______సెక్షన్:________

స్కూల్:_________________

సబ్జెక్టు:__________________

కొత్తపల్లి



పేరు: ____________________

తరగతి:______సెక్షన్:________

స్కూల్:_________________

సబ్జెక్టు:__________________

కొత్తపల్లి



పేరు: ____________________

తరగతి:______సెక్షన్:________

స్కూల్:_________________

సబ్జెక్టు:__________________

## మీ పుస్తకాలకోసం లేబుల్స్

**కొత్తపల్లి**



పేరు: ____________________

తరగతి:______సెక్షన్:________

స్కూల్:__________________

సబ్జెక్టు:___________________

**కొత్తపల్లి**



పేరు: ____________________

తరగతి:______సెక్షన్:________

స్కూల్:__________________

సబ్జెక్టు:___________________

**కొత్తపల్లి**



పేరు: ____________________

తరగతి:______సెక్షన్:________

స్కూల్:__________________

సబ్జెక్టు:___________________

**కొత్తపల్లి**



పేరు: ____________________

తరగతి:______సెక్షన్:________

స్కూల్:__________________

సబ్జెక్టు:___________________

**కొత్తపల్లి**



పేరు: ____________________

తరగతి:______సెక్షన్:________

స్కూల్:__________________

సబ్జెక్టు:___________________

**కొత్తపల్లి**



పేరు: ____________________

తరగతి:______సెక్షన్:________

స్కూల్:__________________

సబ్జెక్టు:___________________

**కొత్తపల్లి**



పేరు: ____________________

తరగతి:______సెక్షన్:________

స్కూల్:__________________

సబ్జెక్టు:___________________

**కొత్తపల్లి**



పేరు: ____________________

తరగతి:______సెక్షన్:________

స్కూల్:__________________

సబ్జెక్టు:___________________

# పదాల్ని వెతికి పట్టుకోండి!

**తెలుగు రాదే, మాసపత్రిక, రాముడు, , దండియాత్ర, అగ్గిపుల్ల, శ్రీకాకులం, ఇంగ్లీషు, ముందుమాట, కాకరకాయ, సారంగాలు, గిరిజనులు, అలివేలమ్మ, సాహసం, పట్టుకోండి, మార్గం, జనవరి, తేలు, నంది, అహింస, సత్యం.** పై పదాలు ఈ క్రింది పట్టికలో దాగున్నాయి- నిలువుగా, అడ్డంగా, వాలుగా, క్రిందినుండి పైకి- ఎటుపడితే అటు! వాటిని వెతికి వాటి చుట్టూ గుండ్రాలు గీయండి!

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| సా | జ | డి | దు | ల్ల | లం | కు | కా | శ్రీ | మా | ప | ట |
| కోం | హ | రి | జ | స | ది | లు | క | త్రి | ప | స | మా |
| వే | లి | సం | షు | హిం | ప | ట్టు | ర | సా | ర్గం | అ | దు |
| ర్గం | గి | జ | తె | అ | తే | లం | కా | న | రా | హ | ముం |
| మా | దే | ను | రి | లు | స | డి | య | కు | ల్ల | ప | రి |
| వ | మా | ఇం | గా | హిం | గు | గి | హ | లు | ట | మ్మ | శ్రీ |
| ల | గ్లీ | రం | న | క | దు | రా | ము | డు | డి | ల | కోం |
| షు | సా | దం | వే | త్యం | స | ప | దే | రి | న | వే | లు |
| శ్రీ | రి | ది | త్ర | వ | ట్టు | డి | జ | ప | ది | లి | ను |
| ల | ర్గం | లం | యా | హ | స | య | ల్ల | పు | గ్గి | అ | జ |
| ప | ట్టు | కోం | డి | తే | దు | షు | స | జ | న | వ | రి |
| జ | ట | సా | దం | కా | శ్రీ | ర | ది | నం | దే | రా | గి |




# పారిపోకు!

*"నీతి: మనం చెయ్యలేని పని అంటూ ఏదీ లేదు. అందువలన మనం అనుకున్న పని పూర్తయ్యేదాకా పట్టువదలకూడదు" అని ఏడో తరగతి సుసన్న రాసిన ఈ కథ చదివితే మాక్కూడా చాలా బాధ వేసింది.*

*రచన : సుసన్న, 7 వ తరగతి, క్రాస్‌వర్డ్ స్కూల్, గుంటూరు.*

*చిత్రాలు:సి.భర్గవి,7 వ తరగతి, రాధ స్కూల్ ఆఫ్ లర్నింగ్, అనంతపురం.*

శివ బాగా చదివేవాడు కాదు; కానీ వాడికి చదవటం అంటే చాలా ఇష్టం!

వినేందుకు ఇదేదో వింతగా ఉంది కదూ? నిజమే. ఇదో వింత సమస్య. చదవమని శివకి ఎవ్వరూ ప్రత్యేకించి చెప్పనవసరం లేదు- ఎందుకంటే వాడు రోజంతా పుస్తకాలు పట్టుకొనే కూర్చునేవాడు; అయితే అంత సేపు కూర్చున్నా వాడి లోపలికి ఏమీ ఎక్కేది కాదు! ఒక అరగంట పాటు కష్టపడి ఏమైనా బట్టీ కొట్టినా, మరో పది నిముషాల్లో దాన్ని మర్చిపోయేవాడు!

దాంతో వాడికి వాడికే కష్టం అనిపిస్తుండేది;

టీచర్లంతా వాడిని 'మొద్దు శివ' అనేవాళ్ళు. తోటి పిల్లలు ఎగతాళి చేసేవాళ్ళు.




శివ చిన్నప్పుడే వాళ్ల నాన్న ఇల్లు వదిలేసి ఎటో వెళ్ళిపోయాడు. ఇంట్లో అమ్మ, చెల్లి, తను- ముగ్గురే ఉండేవాళ్ళు. అందుకని వాళ్ళమ్మ వాడికి రకరకాల పనులు చెబుతూ ఉండేది- "ఫలానా వాళ్ళింటికి వెళ్ళి అప్పు తీసుకురా; కాఫీపొడి ఐపోయింది; ఆవాలు కొన్ని ఇమ్మను; కూలికి పో; వాళ్ళకు సున్నం పూసి పెట్టు, కాసిని డబ్బులు ఇస్తారు.." అంటూ.

రాను రాను ఆవిడ ఇంకో రాగం మొదలు పెట్టింది: "ఎప్పుడూ పుస్తకాలు పట్టుకొని కూర్చుంటే ఇల్లెట్లా గడుస్తుంది? అయినా నీకు ఏమీ చదువు రావట్లేదు కదా, బడికి పోయేదెందుకు?" అని.

ఈ ప్రశ్నకు జవాబు ఎట్లా చెప్పాలో శివకు అర్థం కాలేదు. కానీ బడి మానెయ్యటం మాత్రం వాడికి అస్సలు ఇష్టం లేదు. ఇట్లా ఇంకొన్నినాళ్లు గడిచాయి. అయినా చివరికి అమ్మ మాటే నెగ్గింది. శివ చదువు మానేసి, గ్యారేజ్‌లో పనికి చేరుకోవాల్సి వచ్చింది.

అయితే అక్కడా వాడికి కష్టాలే ఎదురయ్యాయి. గ్యారేజ్ ఓనర్ వాడితో పని చేయించుకునేవాడు గానీ, మనసు పెట్టటం లేదని విపరీతంగా తిట్టేవాడు.

ఆ సమయంలో వాడికి పట్నం గురించి తెలిసింది. 'పట్నంలో ఎక్కడో ఒకచోట బతుక్కోవచ్చు. ఇట్లా రోజూ తిట్లు తింటూ ఉండనక్కర్లేదు..!'

దాంతో ఒక రోజున వాడు ఎవ్వరికీ చెప్పకుండా బయలుదేరి పట్నం వెళ్ళిపోయాడు. అక్కడ టీ దుకాణాల్లోను, హోటళ్లలోను పని చేసుకుంటూ ఇక ఇంటి ధ్యాస అనేదే లేకుండా వారం పది దినాలు

గడిపాడు. అయితే త్వరలోనే వాడికి ఆ బ్రతుకు మీద రోత పుట్టింది. 'అదంతా ఓ మురికి ప్రపంచం! మురికిలోనే పెరుగుతూ, మురికిలో పడుకొని నిద్రపోతూ, బ్రతుకు-తారు అందరూ. ఇట్లా బ్రతకటం కంటే తను పల్లెలో ఉండటమే నయం!'




ఇక కొడుకు ఇల్లు వదిలి పెట్టి పోయే సరికి శివ వాళ్ల అమ్మ శాంతమ్మకు రెక్క తెగినట్లు అనిపించింది. అప్పటి వరకూ వాడిని చూసుకొని బ్రతుకు ఈడ్చిన ఆమె, ఇప్పుడు రోడ్డున పడింది. తల్లి, కూతురు ఇద్దరూ కూడా పట్టణం చేరుకున్నారు.

పట్టణం అంత పెద్దదని ఆమె అనుకోలేదు. తీరా దాన్ని చూసేసరికి 'తను, తన కూతురు అక్కడ ఎట్లా బ్రతుక్కోవాలి?' అని ఆమెకు విపరీతమైన భయం వేసింది. తల్లి, బిడ్డ ఇద్దరూ రోడ్లమీద అడుక్కుంటూ పోయారు. శివ ఫొటో ఒకటి అందరికీ చూపిస్తూ "వీడు నా కొడుకు శివ. వీడిని ఎక్కడైనా చూశారా?" అని అడగడం మొదలుపెట్టింది, వాళ్ల అమ్మ.

సరిగ్గా ఆ సమయానికి ప్రభుత్వం వారు పట్టణంలోని బిచ్చగాళ్లని సంస్కరించే కార్యక్రమం ఒకటి మొదలు పెట్టి ఉన్నారు. వాళ్ళ బృందం ఒకటి రోడ్డు మీద అడుక్కుంటున్న తల్లిని, పిల్లని కనుగొని, వాళ్లని తాము నడిపే "హోం"కు తీసుకెళ్లింది.

వీళ్ల అదృష్టం కొద్దీ అక్కడ ఉన్న అధికారి- మానవత్వం ఉన్నవాడు- ఆయన వాళ్ల వివరాలన్నీ అడిగి తెలుసుకొని, పోలీసుల సహాయంతో పట్నం మూలల్లో ఉన్న శివను వెతికి పట్టాడు.

అప్పటికే పట్నపు జీవితం అంటే విసుగెత్తిన శివ, తల్లి-చెల్లెళ్ల స్థితిని చూసి చలించిపోయాడు. "నేను ఇల్లు వదిలి

పారిపోతే వీళ్ల పరిస్థితి ఇంత ఘోరంగా అవుతుంది- దానికి నేనే బాధ్యుడిని కదా?" అని వాడిలో పశ్చాత్తాపం మొదలైంది.

"నేను మంచిగా ఉంటాను సర్, మేం అందరం మళ్ళీ మా ఊరికి వెళ్ళిపోతాం. నేను కూలి పని చేసైనా సరే, మా కుటుంబాన్ని పోషించుకుంటాను" అన్నాడు అతను, ఆత్మ విశ్వాసంతో.




'హోం' అధికారి శివను మెచ్చుకుని, "ఆ బాధ్యత ప్రభుత్వం తీసుకుంటుందిలే; నువ్వు అంత శ్రమ పడనక్కర్లేదు. నువ్వు-మీ చెల్లి చేయాల్సిందల్లా బాగా చదువుకోవటం; బాధ్యత గల పౌరులుగా ఎదగటం. దీనిలో వ్యక్తిగతంగా కూడా, నాకు చేతనైన సాయం నేను చేస్తాను. మీరు బాగా చదివి సమాజంలో మంచి పేరు సంపాదించుకోవటమే నాకు కావాలి" అన్నాడు, వాళ్లని ఊరికి సాగనంపుతూ.

అట్లా శివ, శివ చెల్లి కూడా మళ్ళీ బడిలో చేరారు. అయితే ఆశ్చర్యం, ఇప్పుడు శివకు తను చదివినవన్నీ అద్భుతంగా గుర్తుంటున్నాయి! అప్పటివరకూ అతన్ని 'మొద్దు' అన్నవాళ్ళంతా ఇప్పుడు 'శివ బలే తెలివైనవాడు; చాలా మంచివాడు కూడా" అనటం మొదలు పెట్టారు.

శాంతమ్మ కూడా "చదువెందుకు?" అనటం మానేసింది. పైపెచ్చు "నన్ను క్షమించురా! నువ్వు చదువుకుంటా అన్నా చదువుకోనివ్వలేదు ఇన్నాళ్ళూ" అని బాధపడింది. ఆపైన శివ ప్రభుత్వ సహాయంతో పై చదువులు కూడా చదివి, పోటీ పరీక్షల్లో నెగ్గి, ప్రభుత్వాధికారి అయ్యాడు: "మానవత్వం ఉన్న మంచి అధికారి-ఈయనకు ప్రజల కష్టం తెలుసు" అనిపించుకున్నాడు.




# పరివర్తన

*రచన: వి.శ్రావణి, 7 వతరగతి, ప్రాథమికోన్నత పాఠశాల, కంకణాల పల్లి*

*చిత్రాలు: పి.శిల్ప,9 వ తరగతి, రాధా స్కూల్ ఆఫ్ లర్నింగ్, అనంతపురం.*

శ్రావణి వాళ్ళ తరగతిలో పిల్లలందరూ పాఠాలను శ్రద్ధగా వినేవారు- ఒకరు తప్ప. ఆ వినని పిల్లాడు కలెక్టరు గారి అబ్బాయి బబ్లు. అతను చివరి బల్ల మీద కూర్చుని బాగా అల్లరి చేసేవాడు. అందరినీ ఏడిపించేవాడు. అయినా ఎవ్వరూ అతన్ని తప్పు పట్టేవాళ్ళు కారు- కలెక్టరు గారి అబ్బాయి కనుక.

ఒకరోజున శ్రావణి వాళ్ళ తరగతికి హెడ్మాస్టర్ గారు వచ్చారు: "ఉపాధ్యాయ దినోత్సవానికి ఇంకా మూడు రోజులు మాత్రమే ఉన్నది. ఆ రోజున ప్రతి తరగతి నుండీ ఒకరు మాట్లాడాల్సి ఉంటుంది: ఉపాధ్యాయుల గొప్పదనం గురించి చెప్పాలి. మరి మీ తరగతి నుండి ఎవరు మాట్లాడతారు?" అడిగారు.

శ్రావణి టక్కున చెప్పేసింది: "మా తరగతి నుంచి బబ్లు వస్తాడండి" అని.

బబ్లు చకాలున తల ఎత్తాడు. "నేను రాను!" అని అరుద్దామనుకున్నాడు. అయితే అంతలోనే హెడ్మాష్టరుగారు బబ్లూని నిలబడమని, విపరీతంగా మెచ్చుకునేశారు: "నాకు చాలా సంతోషంగా ఉంది. బబ్లూ ఇచ్చే స్పీచ్‌ని వినేందుకు మేమందరం ఎదురు చూస్తూంటాం" అని చెప్పేసారు.

దాంతో బబ్లు నోరు మూత పడింది. అందరి ముందూ "ఇది మోసం! నేను మాట్లాడను! ఇదంతా కావాలని చేసింది శ్రావణి!" అని అనలేకపోయాడు. బిక్క మొహం పెట్టుకొని ఊరుకున్నాడు.

ఇంటికి వెళ్ళేసరికి వాళ్ల నాన్న అక్కడ కుర్చీలో కూర్చుని ఉన్నారు. ఆయన దగ్గరికి వెళ్ళి,"నాన్నా! ఉపాధ్యాయుల గొప్పదనం గురించి ఏమని చెప్పాలి? వాళ్ళు నిజంగా గొప్పవాళ్ళా, నాన్నా?" అని అడిగాడు బబ్లు.

"అవును బబ్లూ! వాళ్ళు చెప్పే చదువు వల్లనే మనకి ప్రపంచం గురించి తెలుస్తుంది. అందుకే గురువులను దైవంతో పోల్చారు. నేను ఈరోజున ఈ స్థానంలో ఉన్నానంటే అది మాకు చదువు చెప్పిన ఉపాధ్యాయుల వల్లనే!" అన్నాడు బబ్లూ వాళ్ళ నాన్న.

ఆ తర్వాత బబ్లూ తోటమాలి దగ్గరకు వెళ్ళాడు. "అంకుల్, అంకుల్! టీచర్లు నిజంగా గొప్పవాళ్ళేనంటావా?" అని అడిగాడు.

"అవును చిన్నబాబూ! వాళ్ల వల్లనే మనమూ గొప్పవాళ్లమౌతాం" అన్నాడు తోటమాలి.

"అవునా? మరి వాళ్ళంతా నిజంగానే గొప్పవాళ్లయితే, మరి నువ్వు తోటమాలిలా ఎందుకు ఉన్నావ్? నువ్వూ ఏ కలెక్టరో,

సర్పంచో, డాక్టరో అయి ఉండొచ్చుగా?" అన్నాడు బబ్లూ, తెలివిగా.

తోటమాలి విచారంగా ముఖం పెట్టి "నేను వాళ్ల మాట వినకపోవడంతో ఇదిగో, ఇట్లా అయ్యాను. అటూ ఇటూ కాకుండా సరిగ్గా స్థిరపడలేకపోయాను" అన్నాడు.

"అదేంటి? చదువుకునే రోజుల్లో నువ్వు ఏంచేసేవాడివి?" అడిగాడు బబ్లు. "నేను వెనక బెంచీలో కూర్చుని పిల్లికూతలు కూసేవాడిని" అని తోటమాలి అనగానే బబ్లూకి తన భవిష్యత్తు కనిపించింది.




ఉపాధ్యాయ దినోత్సవంనాడు బబ్లు చాలా చక్కగా మాట్లాడాడు. అందరూ అతన్ని బలే మెచ్చుకున్నారు. బబ్లూకి ఒక్కసారిగా చెప్పలేనంత సంతోషం అనిపించింది.




తరవాత వాడు శ్రావణి దగ్గరికి వెళ్ళి "నువ్వు హెడ్మాస్టరు గారికి నా పేరు చెప్పగానే ముందు చాలా కోపం వచ్చింది. కానీ నువ్వు నాలో మార్పు తెచ్చేందుకే అలా చేశావని తెలుసుకున్నాను. నన్ను క్షమించు" అన్నాడు.

"అయ్యయ్యో, అట్లా అంటావేంటి? నీలో మంచి మార్పు తీసుకురావడం నా బాధ్యత! నేను నిన్ను మార్చాననుకో, అప్పుడు నాకు గురువును అయినంత సంతోషం వస్తుంది ..." అన్నది శ్రావణి నవ్వుతూ.




# పిట్ట తెలివి

రచన: S.అఫ్రీన్, P.నందిత, 8 వ తరగతి, రవీంద్ర భారతి స్కూల్, అనంతపురం.

చిత్రాలు:సి.భర్గవి, 7 వ తరగతి, రాధ స్కూల్ ఆఫ్ లర్నింగ్, అనంతపురం



మామిళ్ళపల్లిలో పెద్ద మర్రి చెట్టు ఒకటి ఉండేది. ఆ చెట్టు తొర్రలో ఒక పిట్ట, దాని పిల్ల నివసిస్తూ ఉండేవి. తల్లి పక్షి రోజూ పోయి, తన పిల్ల కోసం ఆహారం వెతికి తెచ్చేది. "చిట్టి పిల్ల, పాపం ఇంకా రెక్కలు రాలేదు" అనేది. పక్షి పిల్ల ఆ పురుగులను తిని చాలా సంతోషంగా ఉండేది.

కొన్ని రోజులకు పిల్ల రెక్కలు గట్టిపడసాగాయి. అది గుర్తించిన తల్లి పక్షి మెల్ల మెల్లగా దాన్ని గూటి చివరి వరకూ వచ్చేందుకు, ఒక రెక్కను తెరిచేందుకు, మెల్లగా రెండో రెక్కను కూడా తెరిచేందుకు శిక్షణనివ్వటం మొదలెట్టింది:

"ఇదిగో, నేను ఎలా ఎగురుతానో చూడు! అయితే ఎగరాలంటే రెక్కలు గట్టిపడాలి. నీవి ఇంకా లేతగానే ఉన్నాయి. ఇంకొంచెం గట్టిపడ్డాక, అప్పుడు ఎగురుదువు- తొందరపడి ఎగిరితే ప్రమాదం, అర్థమైందా?! క్రింద పడిపోతావు! అందుకని జాగ్రత్తగా ఉండాలి: నేను ఎగరమన్నప్పుడే ఎగరాలి! ఇప్పుడు మటుకు, నేను ఎలా ఎగురుతానో బాగా గమనించు.." అని ఎగిరి చూపించేది.

అట్లా పిల్లకు ఎగరటం ఎలాగో చూపించింది కానీ, దాన్ని సొంతగాఎగరనివ్వలేదు తల్లి. దానికి కావలసిన ఆహారాన్ని కూడా తనే తెచ్చి ఇచ్చేది. తల్లిని చూసి "నేనూ ఎగురుతా త్వరలో" అనుకుంటూ రెక్కలు అల్లాడించేది పిల్ల పిట్ట.

ఆ సమయంలో ఒకరోజు ఉదయాన్నే పిల్లకి ఆహారం తెచ్చి ఇవ్వటం కోసం పోయిన తల్లి పక్షి ఇక తిరిగి రాలేదు!

సమయం గడుస్తున్న కొద్దీ పిల్లకు కడుపులో ఆకలి మొదలైంది. దాంతోపాటు 'తల్లికి ఏమైందో' అని ఆందోళన మొదలైంది.

మధ్యాహ్నం కావస్తుండగా ఇక ఆగలేక, అది మెల్లగా గూటి చివరికి వచ్చింది. ఒక్కో రెక్కనీ అల్లాడించి చూసుకున్నది. ఆ పైన రెండు రెక్కల్నీ ఒక్కసారి అల్లాడిస్తూ ధైర్యం చేసి ముందుకు దూకేసింది!

ఒక్క సారిగా రెక్కలు కలుక్కుమన్నాయి! బలే నొప్పి పుట్టింది. కానీ ఒక్క క్షణం మాత్రమే! ఆ తర్వాత చూసేసరికి తను ఎగురుతున్నది! క్రింద పడిపోలేదు! అట్లా మెల్లగా క్రిందికి వాలి, నేలకు దగ్గరగానే కొంచెం కొంచెంగా ఎగురుతూ ఆ ప్రాంతం అంతటా కలయ తిరిగింది పక్షి పిల్ల.

"అమ్మా! అమ్మా!" అని అరుస్తూ, తక్కువ ఎత్తు కొమ్మల మీద వాలుతూ పోయిన పిల్ల

పిట్టకు చివరికి అక్కడికి దగ్గర్లోనే కనబడింది తల్లి. పిల్ల పిట్ట సంతోషంగా తల్లి మీదికి దూకబోయింది.



"దగ్గరికి రాకు! అక్కడే నిలబడు!" అరిచింది తల్లిపిట్ట భయంతో వణికిపోతూ.

"ఏమైంది? ఎందుకు?" అడిగింది పిల్ల పిట్ట, అక్కడే నిలబడిపోయి.

"కనిపించట్లేదా, నా మీద అంతా ఒక వల పరచుకొని ఉన్నది. నేను ఎంత కదిలితే అది నాచుట్టూ అంతగా బిగుసుకుపోతుంది! వేటగాళ్ళు వలలు వేసి పెడుతుంటారు ఇలా. మనం ఆ వలల దగ్గరికి రాకూడదు. నేను చూసుకోక, ఇట్లా వచ్చి, ఇందులో చిక్కుకుపోయాను!" అంది తల్లిపిట్ట ఏడుస్తూ.

అప్పుడు గానీ పిల్ల పిట్టకు అక్కడొక వల ఉందని తెలీనే లేదు! దాన్ని చూస్తే పిల్ల పిట్టకు కూడా ఏడుపొచ్చింది.

అయినా అది ఏడుపును ఆపుకొని వలని జాగ్రత్తగా పరిశీలించి చూసింది.

గట్టి దారాలతో పేనారు వలను. దారాల మధ్య దూరం ఎక్కువ లేదు.

అయితే వలకు ఒకవైపుగా కొన్ని దారాలు తెగిపోయి ఉన్నాయి. తల్లి జాగ్రత్తగా అటువైపు నడిస్తే, ఆ దారాల మధ్యలోంచి బయట పడచ్చు.."




అది తల్లికి ధైర్యం చెప్పి, దాన్ని మెల్లగా ఆ తెగిపోయిన దారాల వైపుగా నడిపించింది. ఆ

దారాల మధ్య సందులు నిజంగానే పెద్దగా ఉన్నాయి! అక్కడ దూరుకొని, పిల్ల సాయంతోటి వలలోంచి పూర్తిగా బయటికొచ్చేసింది తల్లి!

తల్లి పిట్ట, పిల్ల పిట్ట రెండూ ఆ దగ్గర్లోనే ఉన్న నీళ్లతో ముఖం కడుక్కుని సేద తీరాక, రెండూ కలిసి ఎగిరి, సంతోషంగా తమ గూటికి చేరుకున్నాయి!

"నేను నీలాగా ఆలోచించనే లేదమ్మా! వలలో చిక్కు పడే సరికి నా మెదడు స్తంభించిపోయింది. నువ్వు బలే తెలివిగా ఆలోచించావు- ఆపదలు వచ్చినప్పుడు నిజంగానే, అస్సలు కంగారు పడకూడదు!" అని పిల్లని మెచ్చుకున్నది తల్లి.

ఒకతనికి ఎడమ కాలు బ్లూ కలర్ లోకి మారింది.

గాభరా పడి డాక్టరుకి చూపించాడు.

డాక్టర్: కాలు మొత్తం విషంతో నిండిపోయింది. ఆ విషం మొత్తం శరీరానికి పాకే అవకాశం ఉంది కనుక...వెంటనే ఆపరేషన్ చేసి కాలు తీసేయాలి..




అతనికి ఆపరేషన్ చేసి కృత్రిమ కాలు అమర్చాడు.

కొద్దిరోజులకు కుడి కాలు కూడా నీలం రంగులోకి మారింది.

డాక్టర్: వెంటనే ఆపరేషన్ చేసి కొత్త కాలు అమర్చాలి.. అన్నాడు.

కొద్దిరోజుల తరవాత కృత్రిమ కాళ్ళు రెండు బ్లూ కలర్ లోకి మారిపోయాయి. పేషెంటు వెంటనే డాక్టర్ దగ్గరకు వెళ్ళాడు.

డాక్టర్:నాకు ఇప్పుడు మీ ప్రాబ్లం అర్థమయ్యింది. మీ లుంగీ రంగు వదులుతుంది.. మీరు సరిగ్గా స్నానం చేయకపోవడం వల్ల అది పోవడం లేదు. రేపట్నుండీ స్నానం చేయండి!!!




# పుల్లప్ప మాట

*"నీతి: ఎంత చెడ్డవాడైనా మంచి మాటల వల్ల వివేకి అవ్వగలడు" అంటూ ఈ కథని రాసి పంపించింది జ్యోతి. దీన్ని ఎడిట్ చేసాక మాకూ నమ్మకం కలిగింది- 'అవును, నిజంగానే మంచి మాటలు చెబుతూనే ఉండాలి..' అనిపించింది.*

*రచన: జ్యోతి, 7 వ తరగతి, క్రాస్‌వర్డ్ స్కూల్, గుంటూరు.*

*చిత్రాలు: అంజలి, 7 వ తరగతి, రాధా స్కూల్ ఆఫ్ లర్నింగ్, అనంతపురం.*

అనగనగా ఒక ఊళ్లో ఒక బిచ్చగాడు ఉండేవాడు. అతని పేరు పుల్లప్ప. పుల్లప్ప పుట్టు గ్రుడ్డి. రోజూ బస్టాండులో ఆగే బస్సుల దగ్గరికి వెళ్ళి అడుక్కునేవాడు. అట్లా వచ్చిన డబ్బులతో ఏదో ఒకటి కొనుక్కుని తినేవాడు.

ఒకరోజున బస్టాండులో బస్సు ఒకటి వచ్చి ఆగింది. అక్కడ అడుక్కోవటం మొదలుపెట్టాడు పుల్లప్ప. బస్సు దిగిన ప్రయాణీకులు కొందరు అతనికి తలా ఒక్క చిల్లర డబ్బు ఇచ్చారు. అంతలోనే గుప్పుమని సారాయి వాసన వచ్చింది. ఎవరో మందు

తాగిన వ్యక్తి ఒకడు, బస్సులోంచి దిగాడు. పుల్లప్పకి కళ్ళు లేవు, కానీ ముక్కు పని చేస్తూనే ఉందిగా, ఆ సంగతి అర్థమయ్యింది. సాధారణంగా త్రాగినవాళ్లెవ్వరూ మన లోకంలో ఉండరు. బిచ్చగాళ్లని కసరుకుంటారు. అందుకని పుల్లప్ప అతనికి దూరంగా జరిగాడు. ప్రక్కకి తప్పుకొని అతను వెళ్ళేందుకు బాగా దారి వదిలాడు. తిరిగి వెళ్ళిపోదామని వెనక్కి కూడా తిరిగాడు.

అంతలోనే ఆ త్రాగినతను పుల్లప్పని పిలిచి ఒక రూపాయి దానం చేసాడు. పుల్లప్ప అందరికీ పెట్టినట్టే అతనికీ దండాలు పెట్టాడు.

మరుసటి రోజున కూడా ఇలాగే జరిగింది. త్రాగుబోతువాడు పుల్లప్పని పిలిచి ఒక రూపాయి ఇచ్చాడు. పుల్లప్ప దండం పెట్టాడు.

ఇట్లా పది రోజుల పాటు వరసగా జరుగుతూ పోయింది.

పదకొండో రోజున త్రాగుబోతువాడు పుల్లప్పకి పదిరూపాయల నోటు ఇచ్చాడు.



కానీ పుల్లప్ప దానికోసం ఆశ పడలేదు.

అతని నోటును అతనికి తిరిగి ఇస్తూ "అయ్యా! మీరు మరిచిపోయి నాకు పదిరూపాయలు ఇచ్చారు. ఇదిగో ఇది తీసుకోండి" అన్నాడు.

"మరిచిపోయి కాదులే. చూసే ఇచ్చాను. నా దగ్గర ఇవాళ్ల చిల్లర లేదు" అన్నాడు అతను.

"పర్లేదులెండయ్యా! చిల్లర ఉన్నప్పుడు ఇద్దురులే. లేకపోతే తమరు మాత్రం ఏం చేస్తారు" అన్నాడు పుల్లప్ప, నిజాయితీతో.

"అవును; అయినా ఇది పది రూపాయలని

నీకెట్లా తెలుసు?" అని అడిగాడు.

"కొత్త నోట్లకు చివర గీతలుంటాయి స్వామీ, ఉబ్బెత్తుగా ఉంటాయి. జాగ్రత్తగా చూస్తే ఆ గీతల్ని బట్టి అది ఏం నోటో కనుక్కోవచ్చు" అన్నాడు పుల్లప్ప.

ఆ త్రాగుబోతు వాడు ఆశ్చర్యపోయాడు. "బాగా తెలివైన వాడివేనే! ఇదిగో, ఇవాల్టికి ఈ పది ఉంచుకో, పర్లేదు" అన్నాడు.

పుల్లప్ప తీసుకోలేదు. "అయ్యా! తమరు త్రాగిన మత్తులో ఉన్నారు కాబట్టి, నాకు ఇన్ని డబ్బులు ఇస్తున్నారు. నాకు అనిపిస్తుంది, 'ఈ డబ్బులు ఇస్తున్నది తమరు కాదు, తమరు త్రాగిన మందు' అని. ఒకసారి ఆ మందు ప్రభావం తగ్గాక, తమరే నన్ను తిట్టుకుంటారు, 'మోసం చేసాడు గుడ్డోడు' అని. అందుకని, వద్దు స్వామీ- ఎక్కువ డబ్బులు ఇవ్వకండి. ఏదో మీకు బుద్ధి పుడితే ఒక రూపాయో, రెండు రూపాయలో ఇవ్వండి చాలు" అన్నాడు.

"లేదులే! నేను ఎంత త్రాగినా కంట్రోలులోనే ఉంటాను. అట్లా ఏమీ అవ్వదు" అన్నాడు అతను, కొంచెం తగ్గి.

"అయినా వద్దులెండి అయ్యగారు-" అన్నాడు పుల్లప్ప. ఆపైన కొంచెం సంకోచిస్తూనే "తమబోటి పెద్దలకు నేనేం చెబుతాను గాని, అయినా వయసులో పెద్దోనిగా నేనో మాట చెప్పనా, అయ్యగారు?" అని అడిగాడు.

"చెప్పు!" అన్నాడు ఆ మనిషి.

"అయ్యా! రోజూ చూస్తున్నాను; తమరు రోజూ త్రాగుతున్నారు; ఇలా తాగే బదులు, ఆ డబ్బులతో మీ పిల్లలకు ఏదైనా కొని ఇవ్వచ్చు కదా?!" అని చెప్పాడు పుల్లప్ప.

అతను ఏమీ మాట్లాడలేదు. నిశ్శబ్దం అయిపోయాడు.

"అయ్యా క్షమించండి- ఏదో మనసులో మాటని పైకి అనేసానండయ్యా. మీ పరిస్థితి ఏమిటో నాకు తెలీదు. మీకు పిల్లలు ఉన్నారో, లేదో కూడా తెలీదు.. క్షమించండి. నేను చిన్న మనిషిని..." పుల్లప్ప ఇంకా ఏదో

అంటుండగానే ఆ మనిషి అక్కడినుండి వెళ్ళిపోయాడు.




తను చేసింది మంచి పనో, తప్పుడు పనో అర్థం కాలేదు పుల్లప్పకు. అయితే తను అనుకున్నట్లుగానే మరుసటి రోజునుండీ బస్సులో ఆ త్రాగుబోతు అతను రాలేదు; తనకు రోజూ వచ్చే రూపాయి కూడా పోయింది!

కొన్ని రోజుల తర్వాత ఎవరో పుల్లప్ప చేతికి గుడ్డివాళ్ళు పట్టుకునే ప్లాస్టిక్ కట్టెను ఒకదాన్ని అందించారు- "తీసుకో! నీవల్ల నేను మారాను. ఇప్పుడు నా పిల్లలు కూడా సంతోషంగా ఉన్నారు. చాలా ధన్యవాదాలు!" అని. అతని గొంతును గుర్తుపట్టి దండం పెట్టాడు పుల్లప్ప. అతని పేరేంటో తెలీదుగానీ, ఆ త్రాగే ఆయన దగ్గరినుండి ఇప్పుడు సారాయి వాసన రావట్లేదు.

ఒక పేదవాడు చెరువులో ఒక చేపను పట్టి తన ఇంటికి తెచ్చి వండమని తన భార్యకిస్తాడు.

భార్య: గ్యాస్ లేదు, కిరోసిన్ లేదు, కరెంటు లేదు, నూనె లేదు ఎలా వండేది?

రైతు చేపను తీసుకెళ్ళి మళ్ళీ చెరువులోనే వదిలేస్తాడు దాన్ని.

నీటి ఉపరితలానికి వచ్చిన చేప గట్టిగా "సియం గారికి జై!! పియం గారికి జై!!" అని అరుస్తుంది.

పంతులమ్మ: మీ డాడీ ఏం చేస్తుంటాడోయ్?

చింటు: ఫర్నీచర్ అమ్మే పని టీచర్

పంతులమ్మ: వ్యాపారం బాగా సాగుతోందా, మరి?!

చింటు: బాగా సాగుతోంది టీచర్.. ప్రస్తుతం ఇంట్లో మంచం మాత్రమే మిగిలింది.

జోకు!



# తెలివి-మంచితనం

*రచన: పి.మోక్షిత్, ఏడవ తరగతి, దిల్సుఖ్ నగర్ పబ్లిక్ స్కూల్, హైదరాబాదు*

*చిత్రాలు: సుష్మిత్, 9 వ తరగతి, రాధ స్కూల్ ఆఫ్ లర్నింగ్, అనంతపురం.*



రాజమ్మ, సంగయ్య దంపతులకు ఇద్దరు పిల్లలు- సుశీల్, సాగర్.

వీళ్ళిద్దరిలోనూ సుశీల్ మంచిగా చదువుతాడు; కానీ వాడికి క్రమశిక్షణ లేదు. వాడి బుద్ధి మంచిది కాదు.

సాగర్‌కేమో చదువు లేదు; కానీ క్రమశిక్షణ ఉంది. వాడిది మంచి బుద్ధి.

రాజమ్మ, రంగయ్యలకు ఇద్దరికీ చదువు

రాదు. "మా పిల్లలు ఎట్లా చదువుతున్నారు?" అని వాళ్ళు బడిలో టీచర్లను అడిగేవాళ్ళు.




"సుశీల్ బలే చదువుతాడు. సాగర్‌కు చదువు సరిగ్గా రాదు" అనేవాళ్ళు వాళ్ళు. దాంతో తల్లిదండ్రులు సాగర్‌ని వాయించేవాళ్ళు; "మా సుశీ, మా సుశీ" అంటూ సుశీల్‌ని గారాబం చేసేవాళ్ళు. వాడు ఏది అడిగితే అది కొనిపెట్టేవాళ్ళు.

తల్లిదండ్రులు దగ్గర లేనప్పుడు సుశీల్ సాగర్‌ని ఎగతాళి చేసేవాడు. "నాలాగా ఉండాలి, నువ్వేంటి, ముద్దపప్పులాగా?" అనేవాడు.

సాగర్ నవ్వి, "చేతికి ఉండే ఐదు వేళ్ళే ఒక లాగా ఉండవు. మనం ఇద్దరం మనుషులం ఒకలాగా ఉంటామా? నువ్వేమో తెలివిగల వాడివి, నాకు అన్ని తెలివి తేటలు లేవు- ఏం చేస్తాం" అనేవాడు.

కాలం గడిచింది. సుశీల్, సాగర్ ఇద్దరూ పెద్దవాళ్లయారు. సుశీల్ పెద్ద ప్రభుతోద్యోగి అయ్యాడు. ప్రభుత్వం వాళ్ళు అతనికి ఒక పెద్ద ఇల్లు, కారు ఇచ్చారు. అతని భార్య పెద్ద కుటుంబం నుండి వచ్చింది.

ఇక సాగర్, లెక్క లేనన్ని కష్టాలు పడ్డాక, చివరికి ఓ చిన్న కంపెనీలో గుమస్తా అయ్యాడు. అయితే అతని మంచితనంవల్ల, ఆ కంపెనీ ఓనరు అతన్ని మెచ్చుటం, అతన్ని దగ్గర చేసుకొని, అలా ఓ మోస్తరు జీతం ఇవ్వటం జరిగాయి. సాగర్ భార్యది కూడా సాధారణ కుటుంబం.

" 'చదువుకోరా' అంటే వినలేదు మా

చిన్నోడు. చదువుకొని ఉంటే వాడు కూడా పెద్దోడిలాగా గొప్పవాడు అయ్యేవాడు" అనేవాళ్ళు రాజమ్మ-సంగయ్య. ఆ మాటలు విని సాగర్ భార్య చాలా నొచ్చుకునేది, కానీ సాగర్ మంచితనం ఆమెకూ అంటిందో ఏమో, బయట పడి అత్త మామల్ని ఏమీ అనేది కాదు. "వాళ్ళు ఇప్పుడు పెద్దవాళ్ళయారు. పెద్దవాళ్ళు ఇంతే- మారరు" అని తనే సర్దుకు పోయేది.

ముసలితనం మీద పడిన కొద్దీ రాజమ్మ, సంగయ్య ఊళ్ళో పనులు కట్టి పెట్టి, కొడుకుల దగ్గర ఎక్కువ సమయం గడపాలనుకున్నారు. పెద్ద కొడుకు అంటే వాళ్లకు ప్రేమ ఎక్కువ; అదీ కాక వాడు సంపాదనపరుడు. అందుకని ముందు వాళ్ళ ఇంటికి వెళ్ళారు.

వాళ్ళు వెళ్ళే సరికి కోడలు కొడుకుతో పోట్లాడుతున్నది- "మీ అమ్మవాళ్ళు వస్తే నేను చాకిరి చెయ్యను. వాళ్లకు నువ్వు ఏం చేసుకుంటావో అది నువ్వే చేసుకో" అని. "చూడు, నా పనులు నాకు ఉంటాయి. నువ్వు, వాళ్ళు ఎట్లా ఉంటారో మీ ఇష్టం. నా దగ్గర నచ్చకపోతే వాళ్ళు సాగర్ గాడి దగ్గరికి పోతారు- పొమ్మందాం" అంటున్నాడు పెద్ద కొడుకు!

ముసలివాళ్ళని చూడగానే వాళ్ళిద్దరూ మాటలు కట్టి పెట్టి "వచ్చారా! సరే సరే! మీ గది అదిగో, శుభ్రం చేయించి పెట్టాం. అందులో ఉండండి. ఏం కావాలన్నా పనమ్మాయికి చెప్పండి" అని బయటికి వెళ్ళిపోయారు.

వాళ్ల పిల్లాడు రణధీర్ ఎప్పుడూ సెల్ఫోనులో ఆటలు ఆడుతో, చదువు సంధ్యలు లేకుండా ఉండేవాడు. తల్లిదండ్రులిద్దరూ వాడికి ఏలాంటి మంచి బుద్ధులూ నేర్పలేదు. వాడు తుంటరిగా, వెటకారిగా మొద్దుగా తయారయ్యాడు. రాజమ్మ కొడుక్కు, కోడలికి ఏవో సలహాలు ఇవ్వబోయింది కానీ వాళ్ళు పట్టించుకోలేదు. సుశీల్ ఒక్కోసారి తాగి ఇంటికి రావటం, తల్లి దండ్రులతో మొరటుగా మాట్లాడటం కూడా జరిగింది.

"ఇంత చదివాడు అయినా వీడి జీవితమే

ఇట్లా ఉంది; చిన్నోడికి అసలే చదువు లేదు వాడెట్లా ఉన్నాడో" అని బెంగ పడ్డారు ముసలివాళ్ళిద్దరూ. వాళ్లకు ఆ ఊహ వచ్చిందో లేదో, కోడలు "అయితే మరి వాళ్ళింటికే పోండి!" అని పెట్టే బేడా సర్ది, వాళ్లని చిన్నోడి ఇంటికి పంపించేసింది.

సాగర్ కొడుకు సందీప్ బాగా చదువుతున్నాడు. బాధ్యతగా ఉంటున్నాడు. సాగర్ ఉద్యోగంలో అలసిపోయి ఇంటికి వస్తే భార్య, కొడుకు ఇద్దరూ అతనికి సాయం చేస్తున్నారు. ముసలివాళ్లని వాళ్ళు ప్రేమగా చూసుకున్నారు. వాళ్లతో కలిసి కూర్చొని, మాట్లాడి, అన్నిటిలోనూ వాళ్ల అభిప్రాయాలూ తీసుకుంటున్నారు. చూస్తూండగానే వాళ్ల దగ్గర నెలలు గడిచిపోయాయి. ఈ ఆరు నెలల్లోనూ కొడుకు, కోడలు ఒక్కసారి కూడా కొట్లాడుకోలేదు. కొడుకు ఎలా చదువుతున్నాడో పట్టించుకోకుండా ఒక్క రోజు కూడా గడవలేదు.

"ఏమో అనుకున్నాగానీ, చిన్నోడిదే మంచి జీవితం రాజమ్మా! తెలివి తేటలు ఎన్ని ఉంటే మటుకు ఏం లాభం, క్రమశిక్షణ, మంచితనం ఉండాలి గానీ?!" అంటున్న సంగయ్య మాటలకు "నిజమే" అని తలూపింది రాజమ్మ.

1. చెలిమిని మించిన కలిమి లేదు, సంతృప్తిని మించిన బలిమి లేదు
2. "డబ్బులో శక్తి లేదు. కానీ మంచితనంలో, పవిత్రతలో శక్తి ఉంటుంది."
3. ధీరులు సత్యమార్గాన్ని ఎప్పుడూ తప్పరు
4. వ్యక్తిత్వాన్ని కాపాడుకోవడమే ఆత్మగౌరవం
5. లేవండి, మేల్కొనండి గమ్యం చేరేంత వరకు విశ్రమించకండి
6. ఆత్మ సందర్శమునకు తోడ్పడని జ్ఞానం అజ్ఞానం.
7. ఈ దేశానికి వీరుల అవసరం వుంది. అందుకే వీరులుకండి.
8. ప్రతి మనిషిలోని మంచిని చూడటం నేర్చుకుంటే మనలోని మంచి పెరుగుతుంది.

వివేకానంద వాణి




# కాపాడిన దైవం

*రచన, చిత్రాలు : కంచనపల్లి ద్వారకనాథ్, తిరుపతి*




కృష్ణపట్నంలో ఉదయ్, శరత్ అనే స్నేహితులుండేవారు. అన్ని విషయాలలోనూ వాళ్ళ భావాలు కలిసేవి; కానీ ఒక్క దేవుడి విషయంలో మాత్రం ఇద్దరి నమ్మకాలూ వేరుగా ఉండేవి.

ఉదయ్‌కి భక్తి ఎక్కువ. శరత్‌కేమో నమ్మకం తక్కువ. ఇద్దరూ చాలాసార్లు దేవుడి గురించి వాదులాడుకున్నారు. ఇద్దరూ ఓటమిని అంగీకరించేవాళ్ళు కారు.

బాగా వాదించుకున్నాక, ఆఖరికి శరత్ "ఇదంతా అయ్యేది కాదు- లేని దేవుడిని నువ్వు చూపించనూ లేవు; నేను చూడనూ లేను- ఊరుకో!" అనేవాడు. "సరేలేరా! నువ్వే ఎప్పటికైనా తెలుసుకుంటావులే!" అనేవాడు ఉదయ్.



ఒకసారి విపరీతమైన గాలివాన వచ్చింది. ఊరు మొత్తం జలమయమైంది. లెక్కలేనన్ని ఇళ్ళు, చెట్లూ కూలిపోయినై. అంతలోనే వాతావరణ శాఖ హెచ్చరికలు: ఊరికి పక్కనే ఉన్న నది పొంగనున్నది- వరదలు వచ్చే ప్రమాదం ఉంది! ఊరి ప్రజలంతా అప్రమత్తులై తేరుకునేలోపల విధి వికటించింది: నది పొంగింది; వరదనీరు ఊళ్లోకి రానే వచ్చింది!

ఊళ్ళో ప్రజలంతా ప్రాణాలు అరచేతిలో పట్టుకుని, ఇల్లు వదిలి సురక్షిత ప్రాంతాలకు బయలుదేరారు. అందరితోపాటు ఉదయ్, శరత్ కూడా. ఇంతలో వెనుకనుండి కొందరు "త్వరగా పరిగెట్టండి, నీళ్ళు వేగంగా వస్తున్నాయి, ఎవరిని వాళ్ళు కాపాడుకోండి" అని అరుస్తూ వాళ్ళని దాటుకొని ముందుకు పరుగు పెట్టారు. వాళ్ళ వెనకనే ఉదయ్, శరత్‌కూడా పరుగుపెట్టారు.

ఇంతలో ఉదయ్ నడుస్తున్నవాడల్లా ఆగి తూర్పువైపుకు తిరిగి నమస్కరిస్తూ, "దేవుడా, మమ్మల్ని కాపాడు స్వామీ!" అని మొరపెట్టుకున్నాడు. అంత ఆయాసంలోనూ శరత్ నవ్వుతూ "ఇదిగో, మనం కొద్ది సేపట్లో ఆ కొండ ప్రదేశాన్ని చేరుకుంటాం. ఎందుకంత కంగారు? ఇప్పుడేమైందని ఇక్కడ ఆగి ప్రార్థనలు మొదలెట్టావు? పద,

ముందు పరుగు పెట్టిన వాళ్ళని చేరుకోవాలి మనం కూడా. లేకపోతే ప్రమాదం!” అన్నాడు.



ఉదయ్ ఏదో అనబోతుండగానే అతను "ఇప్పుడు మనం వాదించుకునే సమయం లేదు. త్వరగా పద..." అంటూ అతన్ని ముందుకు నెట్టాడు. అంతలోనే వాళ్ళ వెనకనుండి నీటి ప్రవాహం ఒకటి వేగంగా వచ్చింది. ఉదయ్, శరత్ ఇద్దరూ ఆ నీళ్ళలో పడి తల మునకలయ్యారు. ఉక్కిరిబిక్కిరి అవుతూ కొట్టుకు పోసాగారు. అంతలోనే ఆశ్చర్యంగా వాళ్ల కాళ్ళు ఏవో రాళ్లలో ఇరుక్కున్నాయి. ఇద్దరూ మరో ఆలోచన లేకుండా ఆ రాళ్లను పట్టుకుని పైకి ఎగబ్రాకి, ఆ రాళ్ళ గుట్ట మీద కూర్చున్నారు.

వాళ్లు చూస్తూండగానే నీళ్ళ మట్టం ఇంకా ఇంకా పెరుగుతూ పోయింది. వాళ్ళు ఆ రాళ్ల గుట్ట మీదే ఇంకా ఇంకా పైకి జరుగుతూ పోయారు. చుట్టూ కనుచూపు మేరలో అంతా చెరువులాగా నీళ్లతో నిండిపోయింది! వాళ్ల ముందు పరుగు పెట్టిన జనాల జాడలేదు. ఇద్దరూ అట్లా ఒక రోజంతా కూర్చున్నాక, నీటి మట్టం కొద్దికొద్దిగా తగ్గిపోసాగింది.

"హమ్మయ్య! బ్రతికిపోయాం! అంతా దేవుడి దయ!" అన్నాడు ఉదయ్.

"అదేం లేదు. ఒరేయ్! మన ఊళ్లో నువ్వొక్కడివే కాదు కదా, భక్తుడివి? మరి ఇంతమంది భక్తులుంటే, మరి మీ దేవుడు వాళ్ళందరినీ ఎందుకు రక్షించలేదంటావు?! అంతమంది భక్తుల్ని కాపాడని మీ దేవుడు, ఆయన్ని నమ్మని నన్ను ఎందుకు కాపాడినట్లు?!" అన్నాడు శరత్.

"వాళ్లంతా ఆగి ప్రార్థన చెయ్యలేదు. చేసి

ఉంటే ఇంతకు ముందు లేని ఈ రాళ్ల గుట్ట ఏదో వాళ్లకే దొరికి ఉండేది!" అన్నాడు ఉదయ్.

"అయితే అప్పుడు మనకి ఇక్కడ చోటు సరిపోయేది కాదు!" అన్నాడు శరత్, పంతంగా.

నీళ్ళు తగ్గిన కొద్దీ వాళ్ళు కూర్చున్న రాళ్ళు పొడుగు పొడుగు స్తంభాలలాగా, ఒక దాని మీద ఒకటి ఎగుడుదిగుడుగా పడి ఉన్నట్లు కనిపించసాగాయి. అప్పుడు గానీ శరత్ గమనించలేదు- ఆ రాళ్లన్నీ ఏదో దేవాలయ శిధిలాలు- అవి ఇక్కడికి ఎలా వచ్చాయి?!

అంతలోనే దాన్ని చూసిన ఉదయ్ ఆశ్చర్యంతో "ఒరేయ్! చూశావా, ఆ దేవుడే భూమిలో ఉండి మనల్ని కాపాడాడు. లేకపోతే మనం కూడా ఈ పాటికి జల సమాధి అయి ఉండేవాళ్లం!" అన్నాడు.

శరత్ మాట్లాడలేదు. అతనికి అర్థం అయింది: "దేవుడు అనే భావన కలిగి ఉన్నవాళ్లు మంచినీ, చెడునూ అన్నిటినీ ఆ భావనకే ఆపాదిస్తారు. వారి విశ్వాసంలోనే ఉన్నాడు దేవుడు. దాన్ని ప్రశ్నించటం వల్ల ప్రత్యేకంగా వచ్చే లాభం ఏమీ లేదు. నిజంగా విశ్వసించేవాళ్లు తమ విశ్వాసం ఆధారంగా మానసిక స్థిరత్వాన్ని సాధించుకుంటారు. అట్లా వాళ్ల విశ్వాసంలోని దేవుడే వాళ్లకు మేలు చేస్తాడు! మంచికో, చెడుకో- విశ్వాసమే వాళ్లకు ఉన్న సంపద!" అని.

వానా, వరదా అంతా తగ్గిపోయాక, వరదలో బయటపడిన పురాతన శివాలయాన్ని పునరుద్ధరించి పూజలూ, పునస్కారాలూ చేయనారంభించారు ఊరివాళ్ళు. శరత్ ఇప్పటికీ దేవుడిని నమ్మడు- అయితే అతనిప్పుడు ఎవ్వరితోటీ 'దేవుడు లేడు' అని వాదించట్లేదు!



వినదగునెవ్వరు చెప్పిన- వినినంతనె వేగపడక వివరింప దగున్
కని కల్ల-నిజము తెలిసిన మనుజుడెపో నీతిపరుడు మహిలో సుమతీ!




# మంచివాడు మురళయ్య

*రచన: ఉండ్రాళ్ళ రాజేశం, ఉపాధ్యాయుడు, కప్పలకుంట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.*
*చిత్రాలు: ఐశ్వర్య,7 వ తరగతి, రాధా స్కూల్ ఆఫ్ లర్నింగ్, అనంతపురం.*

పాటిగడ్డలో మురళయ్య అనే భూస్వామి ఒకాయన ఉండేవాడు. మురళయ్యకు వంద ఎకరాలకు పైగా భూమి ఉంది. అతనికి ఏ దేశాలూ, రాష్ట్రాలూ, సాంకేతికతలూ తెలీవు. అతనికి ఉన్నదల్లా మంచితనం, మాటకారితనం. కేవలం ఆ రెంటింటి వల్లా అతని వ్యవసాయం చక్కగా జరుగుతున్నది. ఎలాంటి లోటుపాట్లూ లేకుండా పంటలు పండుతున్నాయి.

కష్టాల్లో ఉన్న వాళ్ళకు అనేక మందికి కోరిన సహాయం చేసేవాడు అతను. పేదలను ఆదుకొని సహాయ-పడుతుండేవాడు. అట్లా అందరూ "మంచివాడు మురళయ్య" అని పిలిచేవాళ్ళు ఆయన్ని.

మురళయ్య మనమడు 'సిద్ధార్థ' పట్నంలో చదువుకుంటున్నాడు. ఒకసారి సెలవల

సమయంలో సిద్ధార్థ పాటిగడ్డకు వచ్చాడు. తాతతో పాటు పొలం దగ్గరికి వెళ్ళాడు. అక్కడ మురళయ్య ఒక పెద్ద రాయిమీద కూర్చుండి, కూలి పనులకు వచ్చిన వాళ్లని ఆప్యాయంగా పలకరిస్తున్నాడు; అందరికీ కూలి డబ్బులు ఇస్తున్నాడు; కొందరికి వాళ్ళు అడిగినంత మొత్తాల్లో ఎక్కువ డబ్బులు కూడా ఇవ్వసాగాడు.




మురళయ్యను గమనిస్తున్నాడు సిద్దార్థ. తాత మాట్లాడే తీరు మరీ మెత్తగా ఉంది. ఎవరైనా ఎక్కువ డబ్బులు అడిగితే కూడా ఈయన జంకటం లేదు- వాళ్ళు అడిగినంత మొత్తం ఇచ్చేస్తున్నాడు.."

అంతలోనే ఎవరో పిల్చినట్లు, సిద్ధార్థ దగ్గరికి ఒక ముసలాయన వచ్చి నిల్చున్నాడు: "మీ తాత తను సంపాదించిన దాన్నంతా ఎట్లా పంచి పెడుతున్నాడో చూసావా? అట్లా అడిగినవాళ్లకల్లా ఇచ్చేస్తే, ఇంక మీకు మిగిలేది ఏంటి, బూడిద!" అన్నాడు వెటకరిస్తూ.

సిద్ధార్థకు తన మనసులో మాటే విన్నట్లయింది. ముసలాయన మాటలు నిజమే అనిపించాయి. తాతమీద చాలా కోపం వచ్చింది. అలిగి ముభావంగా కూర్చున్నాడు.

"ఏమైందిరా, ఎందుకట్లా ఉన్నావు?" అని మురళయ్య ఆరోజు సాయంత్రం అడిగితే, అప్పుడు అరిచాడు వాడు: "నువ్వు డబ్బులన్నీ వృధాగా ఖర్చు చేస్తున్నావని అందరూ అనుకుంటున్నారు.

అట్లా అడిగినవాళ్ళకల్లా డబ్బులు ఇచ్చేస్తుంటే ఎలాగ? మనకు ఏం మిగులుతుంది?" అని.

మురళయ్య ఒక్క క్షణం పాటు ఏమీ మాట్లాడలేదు. తను ఏమైనా 'అతిగా మాట్లాడాడేమో' అనుకున్నాడు సిద్ధార్థ. అయితే వెంటనే చిరునవ్వు నవ్విన మురళయ్య, "రా! నీకో వింత చూపిస్తాను!" అంటూ సిద్ధార్థను వెంట బెట్టుకొని మార్కెట్‌కు వెళ్ళాడు.




మార్కెట్‌లో సిద్ధార్థకోసం పలు రకాల బట్టలు కొన్నారు. దుకాణం యజమాని అందరి కంటే ఎక్కువ తగ్గింపు ఇచ్చాడు మురళయ్యకు. తరువాత వాళ్ళిద్దరూ పోయి కిరాణంలో సరుకులు తీసుకున్నారు. కిరాణం యజమాని కూడా అందరికంటే తక్కువ బిల్లు వేశాడు. ఆపైన ఇద్దరూ మార్కెట్‌కు వెళ్ళి కూరగాయలు కొన్నారు. కూరగాయల వాళ్ళు మురళయ్య సంచినిండా కూరగాయలు నింపి ఇస్తూ "అయ్యా! నీ మేలు తీర్చుకోలేం!" అంటూ నమస్కరించారు.

సిద్ధార్థకు ఆశ్చర్యం అనిపించింది. "మేం వచ్చి కూరలు కొనుక్కుంటే, ఇంక అందులో మేలు ఏమున్నది?" అని ఆశ్చర్యపోయాడు.

అంతలోనే "మీ సంపాదనంతా వృధాగా పంచుతున్నాడు" అన్న ముసలాయన కన్పించాడు. సిద్ధార్థ దగ్గరకు వచ్చి "వచ్చావా?!" అంటూ కౌగిలించుకున్నాడు: "ఇదిగో, మీ తాత చేసిన సాయం వల్ల ఇట్లా బట్టల దుకాణాలవాళ్ళు, కిరాణా దుకాణాలు, కూరగాయలమ్మే వాళ్లే కాదు; నాలాంటి వాళ్ళు కూడా ఎందరో బాగుపడ్డారు. పూర్వీకులనుండి వారసత్వంగా వస్తున్న పొలాల్లో నాణ్యమైన పంటలు పండించి, వాటిలో ఎక్కువభాగాన్ని కూలీలకు ఇవ్వటమే కాదు; మాలాంటి మామూలు

ప్రజలకు కూడా ఇలా అనేక విధాలుగా సాయపడుతున్నాడు మీ తాత.

నువ్వు 'చిన్నవాడివి కదా, ఈ విషయం తెలుసుకోవాలి; మీ తాతని అర్థం చేసుకోకుండా వేధించకూడదు' అనే, నీతో అట్లా అన్నాను. నీ మనస్సుకు బాధ కలిగిందేమో, నన్ను క్షమించు" అన్నాడు ఆ ముసలాయన.

సిద్దార్థ అలక తీరింది. తాత ఎంత మంచి పని చేస్తున్నాడో, ఎందుకు అందరూ ఆయన్ని 'మంచివాడు' అంటారో అర్థమైంది.

తన ఆలోచనలు ఎంత సంకుచితంగా ఉన్నాయో తెలిసి వచ్చింది. పదిమందికి సాయపడడం వెనుక ఉన్న ఆనందాన్ని తాత ఆనందంలో చూడగలిగాడతను. "నేను కూడా ఇప్పటినుండే మంచి పనులు చేస్తాను" అనుకున్నాడు గట్టిగా.

చిలిపి ప్రశ్నలు:

దారిన పోయే మనిషి ఎలా ఉంటాడు?

జ) ఉండమంటే ఉంటాడు!

ఎప్పటికప్పుడు మారిపోయే రణం?

జ)వాతావరణం!

అందరూ నమస్కరించే కాలు ఏమిటి?

జ) పుస్తకాలు!



**దీర్ఘ యాత్ర!**

ICU లో ఉన్న వ్యక్తి రాశి ఫలం చూస్తే ఇలా ఉంది:

"ఈరోజు మీకు శుభదినం. సుదూర ప్రయాణం, తక్కువ ఖర్చు, పాత మిత్రులు, బంధువుల కలయిక, ప్రయాణానికి ఎలాంటి ఆటంకం కలగదు. శుభం..! “




# భద్రం బిడ్డా

*రచన: ఆర్.సి.కృష్ణస్వామి రాజు, రాచపాలెం గ్రామం, పుత్తూరు మండలం, చిత్తూరు జిల్లా.*

*చిత్రాలు : శ్రీ కె.వి.క్రిష్ణారావు గారు, కర్నూలు. ఫోను-* 9348611445

జువ్వలదిన్నె తాండాలో ప్రభుత్వ ప్రాథమిక పాఠశాల ఉంది. నాగరిక సమాజానికి దూరంగా, కనీస వసతులు కూడా లేని తాండా అది. పాఠశాల సైతం పాడుబడిన భవనంలో, నేడో రేపో కూలిపోతుందన్నట్లు శిథిలావస్థలో ఉంది.

స్రవంతి అనే పాప ఆ బడిలో రెండవ తరగతి చదువుతోంది. అమ్మానాన్నలు ఇద్దరూ వ్యవసాయం, కూలి పని చేస్తారు. వాళ్లకు స్రవంతి ఏకైక సంతానం. చాలా చురుకుగా, చలాకీగా, తోటి పిల్లలతో సరదాగా ఉంటుంది. ఆటలు ఆడుతుంది; పాటలు పాడుతుంది. బడికి అందరికంటే ముందు

వచ్చి, చేదబావిలోంచి నీళ్ళు చేది, బడి చుట్టూ ఉన్న చెట్లకు పోస్తుంది.




ఒకరోజు స్రవంతి బడికి వచ్చి కూర్చొని, చక్కగా పలకమీద తెలుగు చూచివ్రాత రాయటం మొదలు పెట్టింది. పుస్తకం కేసి చూడటం, మళ్ళీ పలక మీద రాయటం- ఆ పనిలో ఎంత మునిగిపోయిందంటే, ఆ పాప బలపం అక్కడినుండి జారి దగ్గర్లోనే ఉన్న ఓ చిన్న బొరియలోకి పడిపోయింది.

అయితే అట్లా పడటం గమనించింది స్రవంతి. అదేదో ఎలుకలు చేసిన బొరియ అనుకున్నది. 'బలపం ఎక్కువ లోతుకు పోయి ఉండదు' అనుకున్నదో ఏమో, ఆ బొరియలోకి చెయ్యి పెట్టింది. బలపం దొరకలేదు సరికదా, విష క్రిమి ఒకటి తనను చటుక్కున కాటు వేసింది.

"నొప్పి-నొప్పి! పాము! పాము!" అని అరుచుకుంటూ పరుగులు తీసింది స్రవంతి. పక్కనున్న పిల్లలు భయపడిపోయి కేకలు పెట్టారు; తాండా జనమంతా బడి వద్దకు చేరారు. స్రవంతి అమ్మానాన్నలు ఏడ్చి ఏడ్చి తలలు బాదుకున్నారు. కరిచింది తేలు అయి ఉండచ్చు, పాపకి తెలీక ఎక్కువ భయపడుతున్నది అనుకున్నారు తాండావాళ్ళు.

అయితే అంతలోనే ఆ బొరియలోనుంచి ఒక నాగుపాము జరజరా బయటికి రావటం చూసి జనమంతా అదిరి పోయారు. వాళ్లలో కొందరు పామును పట్టుకొని బంధించారు; 108 అంబులెన్సు వారికి ఫోన్ చేసి పిలిపించారు. చకచకా స్రవంతిని పట్టణంలోని ఆస్పత్రికి తరలించారు.

అయితే అదృష్టం బాగుంది. వాళ్ళు అసుపత్రికి చేరుకునే సరికే అక్కడ డాక్టర్లు విషపు విరుగుడు ఇంజక్షనుతో సిద్ధంగా ఉన్నారు. సరైన సమయానికి వైద్యం లభించటంతో స్రవంతి కాస్తా బ్రతికిపోయింది. కాబట్టి, జాగ్రత్త పిల్లలూ! ఆటలైనా, పాటలైనా, చదువులైనా, చాకిరీ అయినా, జాగ్రత్తగా ఉండాలి. విషక్రిములు ఉండే ప్రదేశాలలో అప్రమత్తతతో వ్యవహరించాలి. ఎప్పుడైనా విషక్రిములు కరిచినట్లు అనుమానం వస్తే తక్షణం దగ్గరలోని ప్రభుత్వ డాక్టర్లను సంప్రదించాలి.

చిలిపి ప్రశ్నలు తిక్క జవాబులు

1. రాయి నీళ్ళలో వేస్తే ఎందుకు మునిగిపోతుంది?
2. గుడ్డు పెట్టలేని కోడి ఏమిటి?
3. వేసుకోలేని గొడుగు ఏమిటి?
4. మొక్కకు పూయని రోజాలు ఏమిటి?
5. రుచిలేని కారం ఏమిటి?
6. అంకెల్లో లేని పది?
7. భార్య లేని పతి ఎవరు?
8. అన్నం తినకపోతే ఏమవుతుంది?
9. తినలేని కాయ ఏమిటి?
10. పిల్లలు ఉండని స్కూల్ ఏమిటి?
11. ఆపరేషన్ చేస్తున్న డాక్టర్లు ముఖానికి గుడ్డ ఎందుకు కట్టుకుంటారు?
12. నోరు లేకపోయినా కరిచేవి?
13. ఎంత విసిరినా చేతిలో ఉండే కర్ర?

1. ఈత రాదు కాబట్టి 2. పకోడి 3. పుట్టగొడుగు 4. శిరోజాలు 5. ఆకారం 6. ద్రౌపది 7. అల్లోపతి 8. మిగిలిపోతుంది 9. లెంపకాయ 10. డ్రైవింగ్ స్కూల్ 11. ఎవరు చేశారో తెలియకూడదని 12. చెప్పులు 13. విసనకర్ర

**కొత్తపల్లి** ప్రింటు పుస్తకాలను ఆన్‌లైన్లో ఆర్డరు చేయటం, చందాలు కట్టటం చాలా సులువు! క్రెడిట్ కార్డుల ద్వారాను, డెబిట్ కార్డుల ద్వారాను, నెట్ బ్యాంకింగ్ ద్వారా కూడా కొత్తపల్లికై డబ్బులు చెల్లించవచ్చు! అక్కౌంటు నెంబర్లు వెతుక్కునే పని కూడా లేదు! సందర్శించండి: **http://www.instamojo.com/kottapalli**



**కొత్తపల్లిని మీ మిత్రులకు, మీరు చదివిన బడులకు, మీ సమీపంలోని లైబ్రరీలకు బహూకరించండి!**

కథల పుస్తకాలండీ కథల పుస్తకాలు! పిల్లలు చెప్పిన కథలున్నాయ్! పెద్దలు వ్రాసిన కథలున్నాయ్!

రంగురంగుల బొమ్మలున్నాయ్! అక్కడక్కడా జోకులున్నాయ్!

ఆన్‌లైన్‌లో దొరుకుతున్నాయ్! ఇప్పుడే కొనండి! అందరికీ చెప్పండి!!!




**రాబోయే 12 సంచికలకై ముందస్తు చందా:**

**రూ. 360/-** (పోస్టేజీ మరియు యస్సెమ్మెస్ ఛార్జీలు కలిపి)

గమనిక: అచ్చయిన పుస్తకాలు ఎప్పటికప్పుడు సాధారణ పోస్టులో పంపబడతాయి.

NEFT TRANSFER కోసం:

"Kottapalli Prachuranalu"
SB A/c 62320333310,
State Bank of India
Dharmavaram Branch
IFSC: SBIN0020902

(బ్యాంకు వారి నియమాలననుసరించి, "క్యాష్ హ్యాండ్లింగ్ చార్జీలు"గా ప్రతిసారీ రూ. 50 అదనంగా చెల్లించవలసి వస్తున్నది.. అందువల్ల బ్యాంకులో డబ్బు కట్టకండి- నేరుగా మీ అక్కౌంటు నుండే ట్రాన్స్ఫర్ చేయగలరని ప్రార్థన)

ప్రస్తుతం అందుబాటులో ఉన్న కొత్తపల్లి ప్రింటు పుస్తకాల వివరాలు:

| క్రమ సంఖ్య | వివరాలు | ఒక సెట్ లోని పుస్తకాల సంఖ్య | స్టాకులో ఉన్న సెట్లు (సుమారుగా) | వెల (రూ) **(పోస్టేజి రూ 50 అదనం)** |
|---|---|---|---|---|
| 1 | 2011 Set | 1 | 500 | 20 |
| 2 | 2012 Set | 8 | 10 | 160 |
| 3 | 2013 Set | 3 | 76 | 75 |
| 4 | 2014 Set | 10 | 314 | 250 |
| 5 | 2015 Set | 7 | 753 | 175 |
| 6 | 2016 Set | 8 | 905 | 200 |
| 7 | 2017 Set | 7 | 1202 | 175 |

మరిన్ని వివరాలకై సంప్రతించండి: కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, యంఆర్వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా, 515101. ఫోను: 7702877670, 9490180695. ఇ-మెయిలు : team@kottapalli.in

RNI Regn No. : APTEL/2014/62705 Date Of Publishing: 01/07/2018 Postal Regn No: HDP/008/2018-2020

## మార్కులా, కథలా?

సుబ్బారావు వచ్చాడు "ఇదిగో, ప్రపంచమంతా 'ర్యాంకులు కావాలి, మార్కులు కావాలి' అని తన్నుకులాడుతుంటే, మీరు ఇట్లా 'కథలు, జోకులు, పాటలు' అని పంతం పట్టుకొని కూర్చోటం బాలేదు" అంటూ.

నేను నవ్వాను. "గుర్తుపట్టావే, మొత్తానికి?!" అన్నాను.

"ఆ మాత్రం తెలుస్తూనే ఉందిలే. అయినా మీ కొత్తపల్లి వాళ్లకి చదువులు కావాలా-అక్కర్లేదా, ముందు ఆ సంగతి తేల్చు, ఇవాళ్ల" అన్నాడు సుబ్బారావు కూర్చుంటూ.

"చూడు సుబ్బారావూ, అర్థం చేసుకో: కథల్లో మనసుకి హాయినిచ్చే గుణం ఉంటుంది. అవి పిల్లల్ని నవ్విస్తాయి; వాళ్లని మెచ్చుకుంటాయి; వాళ్లకు రకరకాల సంగతులు నేర్పిస్తాయి; ఎట్లా ఉంటే మంచిదో చెబుతాయి; జీవితం పట్ల ఆశనీ, భవిష్యత్తు పట్ల ఉత్సాహాన్నీ కలిగిస్తాయి. అట్లాంటివి చదవకపోతే, పిల్లలు తొందరగా ముసలివాళ్ళు అయిపోతారు. నవ్వటం, సంతోషపడటం మరచిపోతారు. నిరాశావాదులు అయిపోతారు. అది ఏం మేలు, చెప్పు?" అన్నాను అనునయంగా.

"అవునులే, రోజంతా పనిచేసాక ఓ కథ చదివితే నాకు కూడా ప్రాణం లేచివచ్చినట్లనిపిస్తుంది. అయినా చదువుకోవాల్సిన పిల్లలు వీటిలో పడితే వాళ్లకి టైం వేస్టు కాదూ?"

"ఇరవై నాలుగు గంటలూ పని చేస్తే ఇంజన్లు వేడెక్కిపోతాయిరా బాబూ! మెదడుల పనితీరుని అర్థం చేసుకోవాలి; వాటికి సేదతీరే సమయం దొరికేట్లు చేయాలి. రిలాక్స్ అయిన మెదళ్లే కదా అద్భుతాలు సృష్టించేది?! ఆట పాటలు, కళలు, సాహిత్యం- ఇవన్నీ మనసుని చల్లబరుస్తాయి. క్రొత్త ఊపిరి పోసి, అంతరంగాల్ని ప్రాణశక్తితో నింపుతాయి"

"నువ్వు ఏదేదో చెబుతావు- అంతేలే" అన్నాడు సుబ్బారావు నిస్సహాయంగా.

"ఇదిగో, నువ్వు నసుగుతూనే ఉంటావుగానీ.. ఇదొక్కటీ చెప్పు- మీవాడి ముఖం కొత్తపల్లిని చూడగానే వెలుగుతుందా, లేదా?" చివరి అస్త్రం ప్రయోగించాను నేను.

కొడుకు ముఖం గుర్తుకొచ్చిన సుబ్బారావు సంతోషంగా నవ్వాడు.

"Kottapalli" Printed and Published by Narayana Sarma on behalf of Kottapalli Prachuranalu and printed at Mudrica Offset Printers, Vijayawada and published at 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuram District, AP-515101. Editor: Narayana Sarma.